# భక్తిలో మీరు

## సంసారులా? వ్యభిచారులా?

**శ్లో॥ "మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ"**

భగవద్గీత శ్లోకము :

యాన్తి దేవ వ్రతాన్ దేవాన్,
పితౄన్ యాన్తి పితృవ్రతా : ।
భూతాని యాన్తి భూతేజ్యా :
యాన్తి మద్యాజినోపి మామ్ ॥


రచయిత : త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు


www.thraithashakam.org





# భక్తిలో మీరు

## సంసారులా? వ్యభిచారులా?


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-41 ద్వితీయ ముద్రణ : మార్చి-2019

ప్రతులు : 1000 **వెల : 90/-**

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దెయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) ౧౦౦, శతము, 100
100) సుప్రసిద్ధి బోధ.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.

88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం.
138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 527 3436, +1(210) 668 8963

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?

ఈ గ్రంథమునకు గల పేరులో ముఖ్యముగా మూడు పదములు వచ్చాయి. అందులో ఒకటి భక్తి, రెండు సంసారి, మూడు వ్యభిచారి. బయట ప్రపంచములో ఈ మూడు పదములు విననివారుండరు, అట్లే తెలియనివారుండరు. ప్రపంచ సంబంధముగా ఈ మూడు పదములు ఉండుట వాస్తవమే అయినా వాటి అర్థములు, భావములు తెలియని వారుండరు. ప్రపంచము ప్రకృతికి సంబంధించినది, ఆధ్యాత్మికము ఆత్మకు సంబంధించినది. ప్రపంచమును లౌకికము అంటారు. అట్లే దైవికమును ఆధ్యాత్మికము అనడము సహజమే. అయితే ఈ మూడు పదములకు లౌకికములో అర్థము వేరు, ఆధ్యాత్మికములో అర్థము వేరు. లౌకిక ధర్మము వేరు, ఆధ్యాత్మిక ధర్మము వేరు. **లౌకిక ధర్మములో అనగా ప్రపంచ ధర్మములో తిట్టు, దూషణ అవుతుంది. ఆధ్యాత్మిక ధర్మములో అనగా ఆత్మ ధర్మములో తిట్టు, దీవెన అవుతుంది.**

లౌకిక ధర్మములో ఒక భావము ఉండగా, ఆధ్యాత్మిక ధర్మములో పూర్తిగా వేరు భావమైపోతుంది. ఒకే పదము రెండు ధర్మములలో వేరువేరు భావములు కల్గియుండునని మనిషి తప్పక గ్రహించవలెను. అట్లు భావ భేదమును గ్రహించనివానిని, తెలియనివానిని మూర్ఖునిగా చెప్పవచ్చును. ఆధ్యాత్మికము, లౌకికము వేరువేరని తెలియునట్లు వేమన యోగిగారు కూడా ఒక పద్యము చెప్పాడు. ఆ పద్యములో లౌకిక ధర్మములో 'లంజ' అను పదమును ఉపయోగించి చెప్పాడు. లంజ అనగా వ్యభిచారి అని అర్థము గలదు. అయితే లౌకిక ధర్మములో అర్థము ప్రకారము వ్యభిచారులు చాలా అరుదుగా ఉందురు. ఎక్కువ శాతము సంసారులుగానే ఉందురు. ఒక నూరుమంది జనాభాలో ఒకరు లేక ఇద్దరు వ్యభిచారులుండవచ్చును గానీ, మిగతా వారందరూ సంసారులుగానే యుందురు. అదే ఆధ్యాత్మిక

రంగములోనికి వస్తే అరుదుగా నూటికి ఒకరు లేక ఇద్దరు సంసారులుగా ఉందురు. మిగతా వారందరూ వేశ్యలుగానే ఉందురు. అందువలన వేమన యోగిగారు తన పద్యములో "లంజకానిదెవరు రాజ్యమందు" అని అన్నారు. రాజ్యము అనగా ఆధ్యాత్మిక రాజ్యములోయని అర్థము చేసుకోవలెను. ఆధ్యాత్మిక రంగములో ఎక్కువ శాతము వ్యభిచారులుగానే యున్నారని ఆయన తన ఉద్దేశ్యమును పద్యములో వ్యక్తము చేశాడు.

వేమన యోగి చెప్పిన ఆధ్యాత్మిక రహస్యములను విప్పి చెప్పడము ఒక గురువుగా నా కర్తవ్యము. అందువలన వేమన యోగిగారు చెప్పిన ఆధ్యాత్మిక పద్యములకు అర్థము చెప్పాలను ఉద్దేశ్యముతో అతికష్టమైన పద్యమును, ఇతరులు అర్థము చెప్పలేనంత కష్టముగాయున్న పద్యములను, అర్థము తెలియక వదలివేసిన పద్యములను ఏరుకొని వాటికి భావమును విపులముగా మేము చెప్పడమైనది. అటువంటివాటిలో ఈ మధ్య కాలమందు **"జలం"** అను ప్రవచనమును చెప్పుచూ వేమన పద్యమును వివరించడము జరిగినది.

**లంజ లంజయండ్రు లౌకిక ధర్మాన**
**లంజ కానిదెవరు రాజ్యమందు**
**లంజ కొడుకు బ్రహ్మ వ్రాతెట్లు వ్రాసెరా**
**విశ్వదాభిరామ వినుర వేమా.**

అను పద్యమునకు ప్రపంచ ధర్మములోను, ఆధ్యాత్మిక ధర్మములోను గల తేడాను వివరిస్తూ ఈ పద్యమును ఆధ్యాత్మిక ధర్మములో వేమనగారు చెప్పాడని, ఆధ్యాత్మిక ధర్మములో ఈ విధమైన భావము కలదు అని చెప్పాము. మేము చెప్పిన విధానము ఏమాత్రము అక్షర జ్ఞానము తెలియని పామరులకు కూడా బాగా అర్థమవుతుంది. అయితే కొందరు ఆధ్యాత్మికవేత్తలను పేరు

పెట్టుకొన్నవారు ప్రబోధానందగారు దేవతలను దూషించాడు అని చెప్పారు. దేవతలను దూషించవలసిన అవసరము అక్కడ లేదు. అయినా దూషించే అవసరము నాకు ఎందుకు వస్తుంది? చెప్పిన విధానమును అర్థము చేసుకో లేని కొందరు నేను బ్రహ్మను లంజకొడుకని దూషించినానని చెప్పారు. అది పద్యములోవుండే వాక్యము. అక్కడ చెప్పినది వేమనయోగి. ఆయన ఆధ్యాత్మిక జ్ఞానమును చెప్పాడు తప్ప ఆయనకు కూడా బ్రహ్మను దూషించే అవసరము లేదు.

ఒక యోగి చెప్పిన పద్య వివరమును గ్రహించుకోలేని బుద్ధిగల వారు ఆధ్యాత్మికవేత్తలని చెప్పుకోవడము సిగ్గుచేటు. కొందరు మమ్ములను విమర్శించిన తర్వాత అందులో ఏమి వివరము గలదోయని వెబ్‌సైట్‌లో గల "జలం" అను మా ఉపన్యాసమును చూచారు. గంట వ్యవధిలో చెప్పిన వివరములో ఎంతో జ్ఞానమున్నదనీ అందులో ఏ దూషణ లేదని చూచినవాళ్ళందరూ చెప్పారు. సామాన్య ప్రజలకు అర్థమయిన వివరము TV చర్చావేదికలలో కూర్చొని, మేము ఆధ్యాత్మికవేత్తలమని చెప్పుకొను వారికి ఎందుకు అర్థము కాలేదో, కొందరికి అర్థమయినా కావాలని మా మీద బురద జల్లే నిమిత్తము అలా మాట్లాడారని తెలియుచున్నది.

ఒక పద్యములోగానీ, గద్యములోగానీ వ్రాయబడిన సమాచారమును ఏదో ఒక రంగములో అర్థము చేసుకోవలెను. ఆధ్యాత్మికములో చెప్పిన దానిని లౌకికములో చెప్పుకొంటే అది తప్పుగా అర్థమగును. అట్లే లౌకికములో చెప్పినది ఆధ్యాత్మికములో కూడా అర్థము చేసుకోకూడదు. అట్లే ఏ భాషలో, ఏ సందర్భములో చెప్పారని పూర్తిగా చూచినప్పుడే అక్కడ వ్రాయబడిన భావము మనిషికి అర్థము కాగలదు. ఇప్పుడు ఉదాహరణగా ఒక పదమును తీసుకొని చూస్తాము. ప్రథమ దైవ గ్రంథమయిన తౌరాత్

లేక భగవద్గీతలో (తౌరాత్ అనే పేరు దేవుడు పెట్టిన పేరు. భగవద్గీత అనునది మనుషులు పెట్టిన పేరు) అక్షర పరబ్రహ్మ యోగము అను అధ్యాయములో 23వ శ్లోకమందు **"యత్ర కాలే"** అని ఉంది. భగవద్గీతలో చెప్పినది సంస్కృత భాష, సంస్కృతమునకు దగ్గర భాష హిందీ భాష. కాలే అను పదము హిందీలో కూడా కలదు. ఎవడయినా నల్లగాయుండే మనిషిని దూషణ ధోరణిలో "క్యా కాలే" అని పిలువడము జరుగుతావుంది. దాని అర్థము "ఏమి నల్లోడా" అని. కాలే అన్న పదమునకు సంస్కృతములో కాలము అను అర్థము కలదు. హిందీలో నల్లోడా అని అర్థము.

ఇప్పుడు భగవద్గీతలో అర్థము ప్రకారము ఏ కాలములో అని చెప్పుకోవచ్చును. కాలే అను పదమును సందర్భానుసారము చెప్పుకోవలసి యుంటుంది. అప్పుడే అది జ్ఞానము అవుతుంది. ఆధ్యాత్మిక జ్ఞానము వదలిపెట్టి లౌకిక జ్ఞానములోనికి పోతే అది అజ్ఞానమవుతుంది. అలాగే యోగి అయిన వేమన చెప్పిన జ్ఞానములో ఆధ్యాత్మిక జ్ఞానమే ఉంటుంది గానీ ప్రపంచ జ్ఞానము ఉండదు. ఆయన చెప్పిన పద్యమును ప్రపంచ ధర్మము ప్రకారము చెప్పుకొంటే బ్రహ్మను లంజకొడుకని దూషించినట్లే అగును. ఆత్మ ధర్మము ప్రకారము చెప్పుకొంటే మనిషియొక్క సృష్ఠి రహస్యమును చెప్పడము కలదు. ఈ కాలములో ఎంతో కష్టమైన పద్యమునకు చాలా సులభముగా అర్థమగునట్లు మేము వివరము చెప్పితే దానిని వక్రీకరించి మాట్లాడువారికి దానిని గ్రహించుకొను గ్రాహితశక్తి అయినా లేకుండా ఉండాలి లేక తెలిసి అసూయతో అయినా మాట్లాడి ఉండాలి.

ఆధ్యాత్మికములో పరిచయము లేనివారికి కూడా ఈ పద్యము యొక్క భావము బాగా అర్థమవుచుండగా, అంతో ఇంతో తెలిసినవారమని

చెప్పుకొనువారు, ఆధ్యాత్మికవేత్తలని పేరు పెట్టుకొన్నవారు, కొందరు స్వామీజీలుగా చలామణి అగుచున్నవారు ముఖ్యముగా నన్ను అజ్ఞానిగా చిత్రించి చెప్పుచున్నారు. అంతేకాక నేను అనేకమార్లు దైవదూషణ చేశానని, వినాయకుడు అంటే సరిపోదు అని, రామున్ని దేవుడు కాదని అన్నానని చెప్పుచున్నారు. దాదాపు నలభై (40) సంవత్సరములుగా నేను దైవ జ్ఞానమును చెప్పుచున్నాను. ఇప్పటికి 106 గ్రంథములను వ్రాయడము జరిగినది. రెండు వందలకు (200) పైగా ఉపన్యాస ప్రవచనములను చెప్పడము జరిగినది. ఇదంతయు నా వైపు జరుగగా, దైవము వైపు నుండి ఇక్కడికి వచ్చి జ్ఞానమును తెలుసుకొన్నవారికి అనేక రోగములు సహితము లేకుండా పోయినాయి. దేవున్ని విశ్వసించిన వాని శరీరమునకు గ్రంథములు అతుక్కోవడము, శరీరములో గల బాధలు లేకుండా పోవునట్లు చేయడము జరుగుతావుంది. అంతేకాక ఇక్కడ గ్రంథరూపములో వచ్చిన జ్ఞానము ఎంతో విపులముగా ఉండడము వలన ఎంతోమంది గ్రంథముల వలన జ్ఞానులుగా మారిపోయారు. చెప్పబడిన లేక వ్రాయబడిన జ్ఞానము సులభముగా తెలియుట వలన ఆంధ్రాలో దాదాపు రెండు లక్షల మంది, తెలంగాణాలో లక్షమంది, కర్ణాటకలో 50 వేలమంది, ఒరిస్సాలో పదివేల మంది నా జ్ఞానమును తెలిసినవారున్నారు. అంతేకాక తమిళనాడులో కూడా త్వరలో నేను చెప్పిన జ్ఞానము ప్రాకగలదు. గడచిన చరిత్రలోనికి చూస్తే అన్ని జ్ఞానములలోకెల్లా అత్యంత వేగముగా మనుషులలోనికి చేరినది నా జ్ఞానమేయని గర్వముగా చెప్పుచున్నాము.

ఐదు రాష్ట్రాలలో లక్షలాదిమంది నా జ్ఞానమును అనుసరించడమే కాక వారు నేను చెప్పిన జ్ఞానమును తప్పు భావముతో కాకుండా మంచి భావముతో అర్థము చేసుకొన్నారు. భూమిమీద దేవుడు, మాయ అను రెండు విభాగములున్నవి. ఏ విషయమును అయినాగానీ ఇటు మాయ

పద్ధతిలో గానీ, అటు దైవ పద్ధతిలోగానీ అర్థము చేసుకోవడము జరుగుచున్నది. నేను చెప్పు ప్రతి బోధ మాయ సంబంధమైన ప్రపంచ ధర్మములో కాకుండా దైవ సంబంధమైన ఆధ్యాత్మిక ధర్మములోనే బోధించాను. దేవుడు కూడా తన బోధను అంతర్ దృష్ఠితో చూడమన్నాడు, బాహ్య దృష్ఠితో చూడవద్దు అని చెప్పాడు. అలాగే వేమన కూడా నా జ్ఞానము ప్రపంచ సంబంధముగా వేయి విధముల అర్థమునిచ్చినాగానీ, అందులో చూస్తే విచిత్రమైన జ్ఞానమే ఉన్నదని చెప్పాడు. ఆ మాటను తన పద్యములో ఇలా చెప్పాడు చూడండి.

**వేయి విధము లమరు వేమన పద్యంబు**
**అర్థమిచ్చు వాని నరసి చూడ**
**జూడ జూడ గల్గు చోద్యమౌ జ్ఞానంబు**
**విశ్వదాభిరామ వినుర వేమా!**

వేమన యోగి మాటలలో తన పద్యము ప్రపంచ సంబంధముగా వేయి రకముల అర్థము నిచ్చినా, ఆధ్యాత్మికరీత్యా ఆశ్చర్యకరమైన జ్ఞానము పద్యములో ఉన్నదని చెప్పాడు. అలాగే నేను మొదటినుండి లౌకిక ధర్మములో కాకుండా ఆధ్యాత్మిక ధర్మములోనే జ్ఞానమును చెప్పాను. అయితే “జలం” అను ప్రవచనమును చాలామంది జ్ఞానులు అయినవారే ప్రపంచ సంబంధముగా అర్థము చేసుకొని, నేను దేవతలను దూషించాను అని అన్నారంటే వీరికి ప్రతి విషయము ఆధ్యాత్మిక ధర్మములో అర్థము కాలేదని తెలియుచున్నది. ఉదాహరణకు చెప్పితే ఒక స్త్రీ పురుషుడు శారీరకముగా దగ్గరయితే దానిని ప్రపంచ ధర్మములో శృంగారము అని అంటాము. అదే ఆధ్యాత్మిక ధర్మములో అయితే దానిని సృష్ఠి రహస్యము అని చెప్పవచ్చును. ప్రపంచ విషయములో అయితే బూతు విషయము అవుతుంది. అదే

ఆధ్యాత్మికములో అయితే జ్ఞానము అవుతుంది. కొందరు నాతో కలిసి నేను చెప్పు జ్ఞానమును గురించి అనేకమైన ప్రశ్నలు అడిగారు. వారు అడిగిన ప్రశ్నలన్నిటికి మేము ఓపికతో జవాబులిచ్చాము. నేడు మా మీద ప్రజలలో గల అపోహలన్నిటిని కూడా ప్రశ్నలుగా అడిగితే వాటికి జవాబు ఇస్తూ ఆ ప్రశ్న జవాబులన్నీ గ్రంథ రూపముగా చేసి **"భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?"** అను పేరు పెట్టి బయటికి ఇవ్వడము జరిగినది. ఈ గ్రంథము వలన అయినా కొందరికి నా మీద ఉన్న చెడు భావములు పోయి మంచి భావము కల్గుతుందని అనుకొంటున్నాను.

**ప్రశ్న :- మీరు బూతు మాటలతో కూడుకొన్న జ్ఞానము కాకుండా మంచి భక్తి భావములున్న జ్ఞానము చెప్పవచ్చును కదా! "జలం" మీటింగ్‌లో వేలమంది గల సభలో "జలం" ను త్రిప్పి చెప్పితే "లంజ" అవుతుందని చెప్పడము సభను కించపరచి మాట్లాడి నట్లు కాదా! సభా మర్యాద ప్రకారము చెప్పేమాటలు బూతు పదాలుగా ఉండకూడదు కదా! త్రిమూర్తులలో ఒకరయిన బ్రహ్మను లంజ కొడుకు అనడము దేవతలను దూషించినట్లు కాదా!యని అడుగుచున్నాము. దీనికి మీరు ఏమంటారు?**

**జవాబు :-** ఏ విషయమునయినా సమగ్రముగా పూర్తి సమాచారమును విన్న తర్వాత అందులో ఏమి సారాంశము కలదని అర్థము కాగలదు. అట్లుకాకుండా ముక్కలు ముక్కలుగా చేసుకొని చూస్తే ఒకటి పోయి మరొకటి అర్థము కాగలదు. ఉదాహరణకు చెప్పితే మత్తు పదార్థములు వాడినవారికి మీరు గుడికి పోవడము మంచిది కాదు అని చెప్పాము అనుకోండి. ఈ మాటను ఎవరు వినినా చెప్పినది సరైనమాటే కదా! సారాత్రాగి గుడికి

పోకూడదు కదా!యని అనుకొంటారు. అట్లుకాకుండా అదే మాటనే మత్తు పదార్థములు వాడినవారు అనడము తీసివేసి **మీరు గుడికి పోకూడదు** అని అంటే భక్తితో గుడికి పోయేవాళ్ళను పోవద్దండి అని చెప్పినట్లగును. అప్పుడు ఆ మాటను అపార్థము చేసుకొను అవకాశము గలదు. గుళ్ళకు పోవద్దండియని ప్రజలకు చెడుగా చెప్పినట్లు కనిపించును. ఇదే విధముగానే నన్ను చెడుగా ప్రచారము చేయదలచినవారు 'జలం' లో విషయమును ముక్కలుగా చేసి బయటికి చూపడము వలన, చెప్పిన జ్ఞానము తెలియకుండా పోయి, అందులో బూతు మాత్రము కనిపించుచున్నది. ఇది దుష్ ప్రచారము తప్ప నేను అందులో బూతులు చెప్పలేదు. స్వచ్ఛమైన జ్ఞానమును చెప్పాము.

"జలం" లాంటి ఉపన్యాసములను మీరు చెప్పకుంటే బాగుండేది అని అన్నారు. నేను ఎన్నో రంగములలో పెరిగినా, దేవుడు చివరకు నన్ను ఆధ్యాత్మిక గురువుగా తయారు చేశాడు. నా వంశములోని వారికి ఏడు తరముల వెనుకనుండి చూచినా ఎవరూ ఆధ్యాత్మిక జ్ఞానము కల్గిన వారు లేరు. తాతలను తండ్రులను బట్టి వారిని అనుసరించి వారి పిల్లలు తయారైనట్లు కాకుండా, మా పెద్దలు వ్యవసాయదారులైనా నేను ప్రత్యేకించి ఆధ్యాత్మికములోనికి రావడమేకాక, మూడు మతముల గురువును కావడము నాది నాకే ఆశ్చర్యముగాయున్నది. దేవుడు అనుకొంటే ఏమయినా చేయగలడు. అదే విధముగా ఒక సాధారణ వ్యక్తిని సిద్ధాంతకర్తగా, సంచలనాత్మక బోధకుడుగా తయారు చేసిన ఘనత దేవునికే దక్కుతుంది. నేను అన్ని సమయములలో సాధారణ వ్యక్తిగా యున్నా కొన్ని సమయములలో ఆత్మ తోడై నన్ను స్వామిగా, గురువుగా తయారు చేసి భూమిమీద ఎవరికీ తెలియని జ్ఞానమును బోధల రూపములో చెప్పడము జరుగుతుంది.

సాధారణముగా ఒక మతములోనే అనేకమంది గురువులు అనేక విధముల ప్రజలకు జ్ఞానమును బోధిస్తూ ఉంటారు. వారి బోధలను చూస్తే ఏ మతములో అయినాగానీ సంపూర్ణ జ్ఞానమును అందివ్వలేదని తెలియు చున్నది. ఉదాహరణకు హిందూమతములో గల గురువులు భగవద్గీతను సంపూర్ణ వివరముగా చెప్పలేకపోవుచున్నారు. భగవద్గీతలో చెప్పినది ఒకటయితే వీరికి అర్థమయినది మరొకటి. అలాంటప్పుడు వారు గురువులుగా సంపూర్ణ జ్ఞానమును ప్రజలకు అందివ్వలేదని తెలియుచున్నది. అలాగే మిగతా రెండు మతములయందు దైవ గ్రంథములలోని జ్ఞానమును సరైన మార్గములో బోధించలేకపోవుచున్నారు. దీనినిబట్టి ఒక మతములో కూడా దేవుడు అందించిన జ్ఞానమును సరిగా అందించు గురువులు లేరని అర్థమగుచున్నది. ఇటువంటి సమయములో అన్ని మతములలో స్వచ్ఛమయిన జ్ఞానమును అందించు గురువుగా నన్ను దేవుడు ఉపయోగించు కోవడము నా అదృష్టముగా నేను భావించుకొనుచున్నాను.

నన్ను దేవుడు ఎంత గొప్ప మార్గములో ఉంచాడో నాకు బాగా అర్థమయినది. అటువంటి నన్ను అజ్ఞాన లోకము చెడుగా అనుకొన్నా ఫరవాలేదు. నేను మాత్రము ప్రజలకు, జ్ఞాన జిజ్ఞాసులకు సరైన జ్ఞానమును అందివ్వాలని భావించుచున్నాను. నేను దైవజ్ఞానమును అందివ్వడానికే బ్రతకాలిగానీ ప్రపంచములో వచ్చే దూషణ, భూషణ, తిరస్కారములను లెక్క చేయకూడదు. అందువలన మనిషికి అవసరమైన జ్ఞానమును అందివ్వాలని ప్రయత్నించుచున్నాను. మనిషి పుట్టుక మొదలుకొని చావు వరకు గల అంతరంగ జ్ఞానమును బోధించాలి. కావున భగవద్గీతలో సాంఖ్య యోగమున చెప్పిన **"వాసాంసి జీర్ణాణి"** అను శ్లోకమును ఇంతవరకు ప్రపంచములో ఎవరూ వివరించని విధానముగా వివరించాము. అందులో నేను ఎంతో ఆధ్యాత్మిక జ్ఞానమును చెప్పినా, దానిని గ్రహించుకోని వారికి

అక్కడ బూతు మాటలు చెప్పినట్లే అర్థమయినది. అక్కడ భగవద్గీతలో భగవంతుడు చెప్పిన జ్ఞానమును వివరించి చెప్పాను. నేను స్వయముగా కల్పించి చెప్పినది ఏదీ లేదు. అట్లే ఆధ్యాత్మిక రంగములో పెద్ద యోగిగా యున్న వేమనగారు చెప్పిన పద్యమును వివరించి చెప్పాను. ఇక్కడ కూడా వేమన చెప్పిన దానిని వివరించాను తప్ప స్వయముగా చెప్పినది ఏమీ లేదు. చెప్పినదానిని గ్రహించుకొను శక్తి లేనివారు నేను ఏదో తప్పు చేసినట్లు మాట్లాడుచున్నారు. ఇది మీలో ఉండే లోపమేగానీ, నా తప్పు ఏమీ లేదని చెప్పుచున్నాను.

గర్భిణీ మనిషి ప్రసవము కొరకు వైద్యుని వద్దకు పోతే ఇది బూతు పని మేము చేయము అంటున్నారా? లేదే. శరీరము మీద గుడ్డలన్నీ తీసివేసి అవసరమయితే స్త్రీ మర్మావయవమైన యోనిలోనికి చేయిపెట్టి శిశువును బయటికి తీయవలసి వస్తావుంది. అప్పుడు వారిని పొగడు చున్నారా లేక బూతు పనులు చేశారని అంటున్నారా? విటుడు స్త్రీ యోనిని ముట్టుకొంటే అది వ్యభిచారము అవుతుంది. ఒక వైద్యుడు వైద్యశాలలో ఆ పనిని చేస్తే అది వైద్యమవుతుంది. ఏది వ్యభిచారము, ఏది వైద్యము అని అర్థము చేసుకోలేని వారిని మూర్ఖులని పిలవాలి. నేను చెప్పినది ఆధ్యాత్మిక వివరమే కానీ ప్రపంచ సంబంధ శృంగార కోణములో చెప్పలేదే? ఏది శృంగారము, ఏది జ్ఞానము అని గ్రహించలేని వారిని మూర్ఖులు అనక ఏమనాలి? వేమనయోగి తన పద్యమందు లంజ అని ప్రపంచములో అనడము జరుగుచున్నది. ప్రపంచ ధర్మములో తప్పుగాయున్న లంజ అను పదమును ఆధ్యాత్మికరంగములో చూస్తే అందరినీ అలాగే చెప్పవలసి వస్తుంది అని చెప్పుచూ "లంజగానిదెవరు రాజ్యమందు" అని అన్నాడు. ఆయన అర్థము ప్రకారము నీటిలో పుట్టనిదెవడు అని అడిగాడు. అంతేకాక శరీరము ధరించి యున్నవాడు ఎవడయినా నీటి నుండే పుట్టాడు, కావున

బ్రహ్మను కూడా లంజకొడుకు అని ఆధ్యాత్మికరీత్యా చెప్పాడుగానీ, ప్రపంచ ధర్మము ప్రకారము ఆయనను తిట్టలేదే. అలా చెప్పడము దేవతలను దూషించినట్లని అంటే వారిని సమయమును సందర్భమును అర్థము చేసుకోలేని మూర్ఖులని చెప్పాలి.

తల్లి ప్రక్కలో ఐదు సంవత్సరముల కొడుకు పడుకొంటే తల్లికి బిడ్డమీద ఎంత ప్రేమో అని అనుకుంటాము. అట్లే 20 సంవత్సరముల యువతి తన ప్రక్కలో 20 సంవత్సరముల వయస్సున్న భర్తను పడుకోబెట్టు కొంటే వారిది భార్యాభర్త ప్రేమంటాము. ఇక్కడ సమయ సందర్భమును బట్టి తల్లి ప్రేమ అని, భార్య ప్రేమ అని రెండూ విడివిడిగా చెప్పుకొంటాము. ఆ ప్రేమల మధ్య ఉండే విధానములు భావములు వేరువేరు అని అందరికీ తెలుసు. అట్లుకాకుండా రెండిటినీ ఒకే విధముగా లెక్కవేసుకొంటే వానిని పరమ మూర్ఖుడు అనాలి. తల్లి ప్రేమను, భార్య ప్రేమను అర్థము చేసుకోలేని అజ్ఞాని అని అనాలి. అదే విధముగా నేను చెప్పినది ఆధ్యాత్మికమా, లౌకికమా అని అర్థము తెలియక రెండిటినీ కలుపుకొన్న వారిని సమయ సందర్భము తెలియనివారుగా, తల్లి ప్రేమను భార్య ప్రేమను విడివిడిగా గుర్తించని మూర్ఖులుగా లెక్కించుకోవాలి. నేను గురువు స్థానములో యున్నప్పుడు మనిషికి దైవజ్ఞానము కల్గుటకు ఎలా బోధించాలో అలాగే బోధిస్తాను తప్ప మూర్ఖులను లెక్కచేయను.

**ప్రశ్న :- దాదాపు రెండు నెలల క్రితము మీ భక్తులు 108 ఊర్లలో కృష్ణాష్టమి వేడుకలను భారీగా చేశారు. కృష్ణాష్టమి రోజు నుండి పదకొండు రోజులు కృష్ణుని ఊరేగింపులు పల్లకి సమేతముగా, సాంప్రదాయబద్ధముగా చేసి మీరు మంచి పేరు తెచ్చుకొన్నారు. వేడుకల ముగింపు సందర్భముగా కొంతమంది**

మీ భక్తులు చిన్నపొడమల గ్రామములోవుండే కృష్ణమందిరము నకు శ్రీకృష్ణుని పూజ నిమిత్తము వచ్చిన సందర్భములో ప్రక్క గ్రామస్థులయిన పెద్దపొడమల వాసులు వినాయక ఊరేగింపును మీ మందిరము ముందుగా తీసుకొచ్చినప్పుడు అనుకోకుండా ఉన్నట్లుండి వారికి మీ భక్తులకు ఘర్షణ జరిగింది. ఆ ఘర్షణలో భాగముగా రెండవ రోజునుండి రాజకీయ వ్యక్తులు కూడా మిమ్ములను విమర్శించడము, తిరిగి రెండవ రోజు మీకు వారికి మధ్య ఘర్షణ జరుగడము, అందులో ఒక వ్యక్తి కూడా చనిపోవడము జరిగినది. ఇదంతా ఒక్కమారుగా రాష్ట్ర వ్యాప్తముగా ప్రచారము కావడము అనేక టీ.వీ ఛానళ్ళు మీ ఆశ్రమము మీద, మీ మందిరము మీద, మీ మీద అనేక చర్చా వేదికలు పెట్టి అనేకముగా మిమ్ములను విమర్శించడము జరిగినది. మొత్తము మీద ఈ సంఘటన గురించి మీరే మంటారు? ఇంతవరకు మీ పేరు, మీ ఆశ్రమము పేరు, మీ కృష్ణమందిరము పేరు తెలియనివారికి కూడా ఒక్కమారు తెలిసిపోయింది. చాలామంది టీ.వీ.ఛానళ్ళు మిమ్ములను ఎ.పి డేరాబాబాగా వర్ణించి చెప్పారు. ఎం.పి దివాకర్ రెడ్డి మిమ్ములను అనేకముగా విమర్శించి మీ ఆశ్రమములో అసాంఘిక కార్యకలాపాలు జరుగుచున్నట్లు ప్రభుత్వానికి కూడా చెప్పాడు. మీరు నేను జ్ఞాన బోధలు చేస్తున్నానని అంటునప్పుడు, ఇటువంటి ఆరోపణలు ఎందుకు వచ్చాయి? ఇటువంటి ఘర్షణలు ఎందుకు జరిగాయి?

**జవాబు :-** 2018 సెప్టెంబర్ 15,16 తేదీలలో రెండు రోజులు మా ఆశ్రమము వద్ద ఘర్షణ జరిగినది వాస్తవమే. వాస్తవముగా కృష్ణాష్టమి వేడుకల ముగింపు సందర్భముగా 14వ తేదీన దాదాపు పదివేల మంది మా భక్తులు కృష్ణమందిరము వద్దకు పూజ నిమిత్తము వచ్చారు. నేను కూడా 14వ తేదీన రాత్రి దాదాపు ఎనిమిది గంటల సమయములో మందిరము వద్దకు పోయి అదే రోజు రాత్రే వైజాగ్ వైపు వెళ్ళిపోయాను. నేను కొన్ని సంవత్సరములుగా మా భక్తులతో ఎవరితోను సంబంధము పెట్టుకోలేదు. ముఖ్యమైన ఒకరు లేక ఇద్దరు తప్ప ఎవరూ నావద్దకు రారు. నేను ఎవరితోను మాట్లాడను. ఇది వివరముగా మీకు అర్థము కావాలంటే కొంత ముందునుండి చెప్పవలసి వస్తుంది.

నేను గత ఐదు సంవత్సరముల క్రితమే ఆరు ఆధ్యాత్మిక సంస్థలను తయారు చేసి, ఆయా సంస్థలకు బాధ్యతగా యున్న కమిటీలను (సంఘము లను) తయారు చేసి పెట్టడము జరిగినది. ఈ ఆరు సంస్థలలో మొదటిది **"ప్రబోధ సేవాసమితి"** ఇది 1991 లోనే తయారయినది. దాని తర్వాత **"ఇందూ జ్ఞానవేదిక".** ఇది 2004 లోనే నిర్మించబడినది. తర్వాత ఇప్పుడు పది సంవత్సరముల నుండి మిగతా నాలుగు సంస్థలను తయారు చేయడమైనది. అందులో **"సువార్త క్రైస్థవ సంఘము"** క్రైస్థవులది కాగా, ముస్లీమ్‌లది **"ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ"** ఈ రెండూ రెండు మతములకు సంబంధించినవికాగా, హిందూ మతములోని కులములకు సంబంధించిన **"ద్రావిడ బ్రాహ్మణ సంఘము"**, **"ద్రావిడ శ్రేష్ఠి సంఘము"** అను రెండు తయారైనవి. మొత్తము మీద ఆరు సంఘములు మా చేత నిర్మింపబడినాయి. ప్రజలలో శ్రద్ధను పెంచి జ్ఞానమును తెలుసుకొనునట్లు మంచి ఉద్దేశ్యముతోనే ఆరు సంఘములను తయారు చేసి, వారికి కేవలము జ్ఞానమును అందించు పనిని మాత్రము నేను తీసుకొన్నాను. ఆరు

సంఘములను ప్రెసిడెంట్లు మిగతా కార్యవర్గ సభ్యులు సక్రమముగా నడుపుకొంటూ, వారు జ్ఞానమును తెలుసుకొంటూ, ఇతరులకు జ్ఞానమును తెలుపుచున్నారు. అన్ని మతములవారు, అన్ని కులముల వారు నా జ్ఞానముతో సంబంధపడి నాకు భక్తులుగా చెప్పుకొంటున్నారు.

చిన్నపొడమలలో ఉండే ఆశ్రమము మరియు కృష్ణమందిరము బాధ్యతలను ప్రబోధ సేవాసమితి, ఇందూ జ్ఞానవేదిక రెండూ సంయుక్తముగా నిర్వహించుట వలన నేను ఏ బాధ్యత లేకుండా అవసరమునుబట్టి జ్ఞానమును అందించడమే పనిగా పెట్టుకొన్నాను. నేను హైదరాబాద్ మరియు బెంగుళూరులలో నివాసముంటూ సంవత్సరమునకు ఒకటి లేక రెండుమార్లు కృష్ణమందిరమునకు పోయివస్తాను. ప్రతీ నెల అన్ని సంఘములు కృష్ణమందిరములో సమావేశమగుచూ, పౌర్ణమి రోజు మా ప్రవచనములను స్వీకరించడము, వారి అభివృద్ధి కార్యక్రమాలను అందరూ కలిసి చూచుకోవడము జరుగుచున్నది. ఇందులో నేను వ్రాసిన గ్రంథముల సంబంధముగా నాకు కొంత ఆదాయము రావడము జరుగుచుండును. మిగతా ఖర్చులు, ఆదాయములు అన్నీ వారి వారి సంఘములకు తప్ప నాకు ఎటువంటి సంబంధము ఉండదు. బయట నాకు గల వ్యాపారము లలో వచ్చు ఆదాయములో నేను కొన్ని లక్షలు కృష్ణమందిరము సేవకు వినియోగిస్తుంటాను. అట్లే నా గ్రంథములలో వచ్చిన కొద్దిపాటి ఆదాయమును కూడా కృష్ణమందిరము అభివృద్ధికే వినియోగించుకుంటాము.

ఈ విధముగా యున్న నాకు కృష్ణమందిరము వద్ద జరిగిన ఘర్షణకు ఎటువంటి సంబంధము లేదు. మేము మా భక్తులు ప్రశాంత జీవనమును కోరుకొంటాము గానీ, అశాంతిని రేకెత్తించే విధానములను కోరుకోరు. సెప్టెంబర్ 15వ తేదీన జరిగిన ఘర్షణ మా భక్తులు ఊహించినదే కానీ

నేను అట్లు జరుగుతుంది అని అనుకోలేదు. ముందే ఊహించిన ప్రబోధ సేవాసమితి వారు ఆ విషయమును పోలీస్ వారి దృష్టికి వారము రోజుల ముందే తీసుకెళ్ళారు. దానికి పోలీస్‌వారు అటువంటిది ఏమీ జరుగకుండా చూచుకుంటాము మీరు ఏమీ టెన్షన్ పడవద్దండి అని చెప్పారు. ఇదే విషయమును వారములోపల మూడుమార్లు చెప్పాము. ఇంటలిజెన్స్ వారు కూడా ముందుగా ఘర్షణ జరిగే అవకాశములున్నాయి అని తెలియజేశారు. ప్రక్కనే గల పెద్దపొడమలవారు ప్రతి సంవత్సరము వారి ఊరి నుండి పడమటి వైపు పోయి, అక్కడగల నీటికుంటలో వినాయకుని నిమజ్జనము చేసేవారు. ఈ సంవత్సరము పోలీస్ సి.ఐ సురేంద్రనాథరెడ్డి అనునతడు ఆ గ్రామములోనికి పోయి మీరు అందరూ ప్రబోధాశ్రమము ముందు నుండి పోవాలి అని చెప్పగా, ఆ గ్రామస్థులు చాలామంది ఆయన మాటను ఒప్పుకోలేదు. అది మాకు దారికాదు మేము పడమటి వైపుగల నీటికుంట వైపు పోతాము అని చెప్పారు. అయినా సి.ఐ సురేంద్రనాథరెడ్డి రెండు విగ్రహములను బలవంతముగా ఆశ్రమమువైపు తెచ్చాడు. కొంతమంది పడమటివైపు పోగా రెండు విగ్రహములను తూర్పువైపు తెచ్చాడు. ఆశ్రమము వద్ద గలాటా చేయాలని వారికి నేర్పించి వారి ట్రాక్టర్లలో రాళ్ళు, కట్టెలను కూడా తెచ్చుకోవడము జరిగినది.

ఈ విషయములన్ని ఆ ఊరిలోని కొందరి ద్వారా తెలిసి మా భక్తులు, సంయమనము పాటించాలి, వారు రెచ్చగొట్టినా మనము రెచ్చిపోకూడదు అని మాట్లాడుకొన్నారు. ఘర్షణ జరిగితే తప్పనిసరిగా పోలీస్ కేసులు పెట్టుతారని మావారు ఓర్పుగా ఘర్షణ జరగకూడదను ఉద్దేశ్యముతో ఉన్నారు. గతములో ఒక సంవత్సరము నుండి స్థానిక M.L.A. జె.సి. ప్రభాకర్ రెడ్డి మా మీద కక్షగట్టి ఆశ్రమానికి నీటి కనెక్షన్ తీసివేయడము, కరెంట్ కనెక్షన్ తీయించడము, బిల్డింగ్ పర్మిషన్ ఉన్నా లేదని ఆశ్రమాన్ని

కూలగొట్టాలని పంచాయితీవాళ్ళను ప్రేరేపించడము ఇట్లు అనేకముగా చేశాడు. మేము అన్నిటిని ఓర్చుకొన్నాము. అదే పెద్ద పొడమల గ్రామము వారి చేత ఆశ్రమమునకు చెందిన ట్రాక్టర్‌ను కూడా అగ్గిపెట్టి కాల్పించాడు. త్రోచుకొన్న ఘర్షణను పోలీస్ వారిచేత హత్యా ప్రయత్నము చేసినట్లు మా భక్తుల మీద కేసు కూడా పెట్టడము జరిగినది. పర్మిషన్‌తో ఇసుకను ఆశ్రమ నిర్మాణమునకు తెచ్చుకొంటూ వుంటే పర్మిషన్ లెటర్ చించివేసి అక్రమముగా ఇసుక రవాణా చేయుచున్నామని, రెండు లారీలను ఆరు నెలల పాటు పోలీస్ స్టేషన్‌లో నిలిపివేశాడు. ఇటువంటివి ఎన్నో చేశాడు. అయినా అన్నిటిని ఓర్చుకొని మా అభివృద్ధికి ఆటంకము ఏర్పడకూడదని మా పని మేము చేసుకొంటూ పోతున్నాము. నేను ఆశ్రమానికి దూరముగా యున్నా నన్ను కూడా అతని క్రింద అనుచరునిగా చేసుకోవాలని ఎన్నో ప్రయత్నములు చేశాడు. నా చేత డబ్బులు లాగాలని చూచారు. గత 40 సంవత్సరముల నుండి ఈ ప్రాంతములో J.C బ్రదర్స్ రౌడీయిజమ్ కొనసాగిస్తూ, ప్రజలనందరినీ వారి వశములో పెట్టుకొని వారు చెప్పినది ప్రతి ఒక్కటి జరిగేటట్లు చేసుకొని వారి కనుసన్నలలో తాడిపత్రి వాసులందరూ నడుచునట్లు చేసుకొన్నారు. ఎవరయినా వారి మాట వినలేదు అంటే వారి క్రిమినల్ మైండ్‌తో అనేక సమస్యలు సృష్ఠించి, పోలీస్ కేసులు బనాయించి, తమ దారిలోనికి తెచ్చుకోవడము వారికి అలవాటై పోయింది. చిన్న వ్యాపారము నుండి పెద్ద వ్యాపారము వరకు వచ్చు లాభములో కొంత శాతము వారికిచ్చునట్లు చేసుకొని వేలకోట్లు సంపాదించారు. వారికి ఎదురుగా ప్రతిపక్షము అనేది లేకుండా చేసుకొన్నారు. చివరకు ఆశ్రమాల మీద కూడా వారి దౌర్జన్యములను కొనసాగించి మా నుండి కూడా డబ్బు లాగాలని చిన్నపొడమల ప్రెసిడెంట్ ద్వారా ప్రయత్నించారు.

మా వద్ద వారి పన్నాగము సాగకపోయేసరికి వారి దృష్టినంతా మా మీద పెట్టి మమ్ములను లొంగదీసుకోవాలను ప్రయత్నములోనిదే సెప్టెంబర్ 15,16వ తేదీలలో జరిగిన దాడియని చెప్పవచ్చును. వినాయక నిమజ్జనము రోజు మేము వారిని అడ్డుకొనగా ఘర్షణ మొదలగునట్లు ముందే వ్యూహ రచన చేసి, పోలీస్ సి.ఐ చేత ఊరేగింపును బలవంతముగా ఇటువైపు తెచ్చారు. ఘర్షణ జరిగితే మా భక్తులను తరిమికొట్టుటకు కావలసిన రాళ్ళు, కట్టెలు ట్రాక్టర్లలో తెచ్చుకోవడము జరిగినది. అంతవరకు అయితే ఘర్షణ జరుగక పోయేది. కానీ అట్లు కాకూడదని J.C సోదరులు పథకము ప్రకారము ఎవరికీ తెలియకుండా అనంతపురము నుండి తెచ్చిన 30 మంది కిరాయి మనుషులను మా భక్తులవలె మాలో కలిపియుండే విషయము మా వారికి కూడా తెలియదు. ముఖాన చక్రాలు ధరించిన వారందరూ మా భక్తులే అనుకోవడము వలన వారు సులభముగా మాలో కలిసిపోయారు. అలా మాలో కలిసియుండడము దాదాపు మూడు నాలుగు నెలల నుండి జరుగుచున్నదని మాకు ఆలస్యముగా తెలిసినది. ఎవరికీ అనుమానము రాకుండా మా వారిలో కలిసిపోయిన వారి మనుషులు సెప్టెంబర్ 15వ తేదీన ఘర్షణ మొదట వారే మొదలు పెట్టారు. మొదట ఘర్షణ మొదలయితే అందరూ ఘర్షణకు వస్తారని వారి అంచనా. అదే విధముగా మా వాళ్ళకు తెలియకుండా భక్తుల ముసుగులో యున్నవారు మొదట ఘర్షణ మొదలు పెట్టారు. వెంటనే మా వారు కూడా స్పందించి సైరన్ మ్రోగించి అప్పటికప్పుడు కట్టెలు తీసుకొని వినాయక ఊరేగింపును చెదరగొట్టి పారిపోవునట్లు చేశారు. అప్పుడు ఎవరికీ ఏ ప్రమాదము జరుగలేదు. ఆ ఘర్షణలో భక్తుల ముసుగులో యున్న వారి మనుషులే వినాయక విగ్రహాలను పగులగొట్టడము, ట్రాక్టర్లను కాల్చడము జరిగింది. అదంతా చేసేవాళ్లు మా వారే అని మా భక్తులు కూడా ఆ పనులలో కలిసి

యుండవచ్చును. ఈ విధముగా జరిగిన దానినిబట్టి ఆశ్రమమువారే దాడి చేశారని పెద్ద పొడమలవారు అనుకోవడము జరిగినది.

అంతటితో పెద్దగా కేసులు బనాయించే దానికి వీలుపడదని తలచిన J.C సోదరులు, భక్తులవలె యున్నవారి మనుషులకు ఫోన్‌ల ద్వారా రెండవ రోజు ఘర్షణ జరుగునట్లు, అప్పుడు ఆశ్రమము మీదికి ఘర్షణకు వచ్చిన వారిలో ఒకరిని చంపమని ఆదేశమిచ్చారు. అందులో భాగముగా రెండవ రోజు M.P. దివాకర్ రెడ్డి 144 సెక్షన్ అమలులోయున్నా వచ్చి ఆశ్రమానికి వేయి అడుగుల దూరములో యున్న మెయిన్‌రోడ్డు మీద ధర్నాకు కూర్చోవడము ప్రబోధానంద స్వామిని అరెస్టు చేసేవరకు పోనని చెప్పి కూర్చోవడము జరిగినది. ఉదయము ఎనిమిది గంటలకే ఆ కార్యక్రమము మొదలు పెట్టగా, ఆశ్రమము ముందర పోలీస్‌వారు దాదాపు రెండు వందలమంది ఉండడము జరిగినది. ఒకవైపు దివాకర్ రెడ్డి ధర్నా చేయుచూ మరొకవైపు తన అనుచరులను ఆశ్రమము మీదికి దాడిచేయుటకు ఉసిగొల్పాడు. ఆశ్రమము వెనుకవైపు పదిమంది పోలీస్‌లు ఉన్నట్లు చేసి, వారు కూడా చూపాకారానికి ఉండునట్లు చేసి, వారి మనుషులను మందిరము మీద దాడి చేయుటకు సులభతరము చేశాడు. ఉదయము 10 గంటల నుండి దాడి జరుగుచున్నా, రాళ్ళు ఆశ్రమములో కృష్ణమందిరము ముందర పడుచున్నా మా వారు ఎంతో ఓర్పుతో లోపలే ఉండిపోయారు. మధ్యాహ్నము రెండు గంటల వరకు అలాగే కొనసాగింది. దాడి చేయు వారిమీద పోలీస్‌వారు లాఠీచార్జ్ చేయడముగానీ, టియర్‌గ్యాస్ ప్రయోగించడముగానీ చేయలేదు. చివరకు రెండున్నర గంటల ప్రాంతములో ఒక వ్యాన్‌లో తెచ్చుకొన్న పెట్రోల్ పాకెట్లను, బీర్‌బాటిళ్ళను విసురుచూ వచ్చి ఆశ్రమము దగ్గర ఆపివుంచిన పది వాహనముల మీద, ఐదు వ్యాన్లు,

ఐదు కార్ల మీద దాడిచేసి, వాటిని పెట్రోల్ పోసి అంటించే సమయములో మా ఆస్తులను కాపాడుకొను నిమిత్తము, మా భక్తులు బయటికి పోయి వారిని తరిమివేయాలని చూచారు. అదే అదనుగా కాచుకొని భక్తుల ముసుగులో ముఖము మీద చక్రాలు ధరించిన అనంతపురము మనుషులు అక్కడికి వచ్చినవారిలో ఒకనిని చంపడము జరిగినది. అట్లే మిగతా ఇద్దరిని కూడా తీవ్రముగా కొట్టారు. మొత్తము మీద ముగ్గురు క్రింద పడిపోగా అలా J.C మనుషులను చంపి మా మీద బలమైన మర్డర్ కేసులు పెట్టాలని వారి పథకము, అలాగే జరిగింది. J.C మనుషులను J.C కిరాయి మనుషులు చంపుతారని పెద్దపొడమలవారు కూడా అనుకోలేదు. ఈ ప్లాన్ ఎవరికీ తెలియదు. J.C మాటలు విని ఆశ్రమము మీదికి దాడికి వచ్చినవారిలో ముగ్గురు పడిపోగా, మిగతా వారందరూ పారిపోయారు.

మా భక్తులకు ఎవరినీ చంపే ఉద్దేశ్యము లేదు. అయినా జరిగిన సంఘటన తమ వలననే జరిగి ఉంటుందనుకొన్నారు. ఒక్కమారు మా భక్తులు ఊహించని రీతిలో వేలాదిమంది బయటికి వచ్చినది చూచి J.C దివాకర్ రెడ్డి అక్కడి నుండి పారిపోయాడు. ఇదంతా నాలుగు నిమిషములలో జరిగినది. అంతవరకు ప్రేక్షక పాత్రగాయున్న పోలీసులు ఒక్కమారుగా మావారి మీద లాఠీలతో కొట్టడము, టియర్గ్యాస్ ప్రయోగించడము చేశారు. అప్పటి నుండి పోలీసులు మా రక్షణ నిమిత్తమని ఆశ్రమము చుట్టు చేరి, మమ్ములను నిర్బంధించి రెండు మూడు రోజులకు 40 మందిని దాడిలో ఉన్నారని అరెస్టు చేయుచూ, దాదాపు నెల రోజులు అరెస్టులు కొనసాగించారు. మావారు మా ఆశ్రమమువద్దే యున్నా వారే వచ్చి రెండు రోజులు ఘర్షణ చేసి, చివరకు మేము తప్పు చేసినట్లు మా వారి మీద 27 కేసులు బనాయించారు. ఎదుటి వారి మీద మావారు

రిపోర్టు చేసినాగానీ ఒక్క కేసు కూడా పెట్టలేదు. దీనితో పోలీస్‌వారు అటువైపు పూర్తిగా పని చేస్తున్నారని తెలిసిపోయింది. J.C బ్రదర్స్‌లో ఒకరు M.L.A గా, ఒకరు M.P. గా యుండి పూర్తి అధికార దుర్వినియోగము చేశారని అర్థమగు చున్నది. రాష్ట్రమంతా చెడుగా J.C బ్రదర్స్‌ను చెప్పుకుంటున్నా వారిని తెలుగు దేశము ప్రభుత్వము ఎందుకు అదుపు చేయలేదో తెలియదు. వీరిగుండా తెలుగు దేశము పార్టీకి ప్రజలలో చెడ్డ పేరు వస్తుందని పార్టీ అధినేతలు గుర్తించలేకపోయారు.

2018 సెప్టెంబర్ 15వ తేదీన నేను విశాఖపట్టనము జిల్లా అయిన అరకు ప్రాంతములో యుండుట వలన, నాకు ఫోన్ లేకపోవడము వలన, ఆశ్రమము వద్ద జరిగిన విషయము కొంత ఆలస్యముగా తెలిసింది. అసలు కుట్రలన్నీ అనంతపురము వారిని తెచ్చి మా భక్తులలో కలిపిన విషయము దాదాపు నెలకు ఇతరుల ద్వారా మాకు తెలిసింది. అంతవరకు మా ఆశ్రమము వారికి కూడా ఈ కుట్ర విషయము తెలియదు. అదే పనిగా కుట్రలు చేసిన J.C సోదరులు లక్షలాది రూపాయలు T.V ఛానళ్ళకు ఇచ్చి మాపై దుష్ప్రచారము చేయించారు. ఘర్షణ జరిగిన వారము రోజులకు నేను కూడా T.V వారికి ప్రెస్‌మీట్‌లో ఇదంతయు J.C బ్రదర్స్ అదే పనిగా చేయుచున్నారని చెప్పాము. ఇంతవరకు మేము ఏ విషయములో వారికి పోటీకి పోలేదు. అయినా వారు ప్రతిచోట మాకు అడ్డువస్తున్నారు. వీరి దురాగతాలను ఎదిరించే దానికొరకు మేము కూడా రాజకీయములలోకి వస్తామని చెప్పాము.

J.C దివాకర్ రెడ్డి మా ఆశ్రమములో అసాంఘిక కార్యకలాపాలు జరుగుచున్నాయని T.V ఛానళ్ళలో ప్రచారము చేయించాడు. దాని కారణముగా జిల్లా కలెక్టర్, జిల్లా ఎస్.పి గారు అనేకముగా ఆశ్రమములో

గాలింపులు జరిపి, అటువంటివి ఏవీ లేవని తేల్చి చెప్పారు. అంతేకాక ఈ విషయములో J.C బ్రదర్స్ తప్పుడు ఆరోపణలు చేశారని మీడియా వారు కూడా గమనించి అటువంటిది ఏమి లేదని వారు పేపర్లలో ప్రకటించారు. దానివలన J.C వారికే ప్రజలలో మర్యాదపోయింది. మా మర్యాద తీయాలనుకొన్నారు చివరకు వారి మర్యాదే పోయింది. కొందరు T.V ఛానళ్లు కేవలము డబ్బు సంపాదన నిమిత్తమే పెట్టుకొన్నారు. అట్టివారు J.C బ్రదర్స్ ఇచ్చే డబ్బులకు లొంగిపోయి మాపై దుష్ప్రచారము చేశారు తప్ప, మా ఆశ్రమములో మా భక్తులలో ఏ తప్పులేదు, ఏ తప్పు జరుగడము లేదు.

**ప్రశ్న :- ఎంతోమంది వ్యాపారుల నుంచి, ఎన్నో ఫ్యాక్టరీల నుండి డబ్బులు వాటా పొందుతున్నారను మాట మేము కూడా విన్నాము. స్టీల్ ఫ్యాక్టరీ, సిమెంట్ ఫ్యాక్టరీ ద్వారా నెలకే కోట్ల రూపాయలు వస్తున్నవని ప్రజలు అనుకొనగా విన్నాము. అయితే జ్ఞాన ప్రచారము చేయు మీలాంటి వారిమీద ఎందుకు అంత కక్షపూనినారు అన్నది కొంత అర్థము కావడము లేదు. మీరు ఇక్కడ లేము ఎక్కడో హైదరాబాద్, వైజాగ్, బెంగుళూరులలో ఉంటామని చెప్పుచున్నారు. మీరు సన్న్యాసి కారు గృహస్థుడుగా యుండి మీరు భార్య పిల్లలు కలిగియున్నారు. అయితే J.C దివాకర్ రెడ్డి మీ భక్తులను కాకుండా పదే పదే మిమ్ములనే ఎందుకు చెప్పుచున్నారు. దీని వెనుకల ముఖ్యకారణము ఏమి కలదు?**

**జవాబు :-** ఒక్కమాటలో చెప్పాలంటే ధనకాంక్ష, అధికారకాంక్ష ఈ రెండే వారిలో పూర్తి ఇమిడిపోయాయి. అందువలన మమ్ములను కూడా వదలడము లేదు. మేము వారు అడిగిన డబ్బు ఇవ్వలేదు, వారి అధికారమునకు వారి ముందర చేతులు కట్టుకొని నిలబడలేదు. ఆశ్రమానికి మా భక్తులే కమిటీ ఏర్పరచుకొని బాధ్యతగా యున్నా, నాకు కృష్ణ మందిరముతో ప్రబోధాశ్రమముతో సంబంధము లేకున్నా నన్ను ముఖ్యముగా విమర్శించడానికి పునాది 1993లో కలదు. ఇప్పటికి 25 సంవత్సరముల క్రితము ఆయనకు వ్యతిరేఖముగా B.J.P పార్టీవాళ్ళకు ఒక రోజు అన్నము పెట్టామని, అప్పటి నుండి నా మీద ద్వేషము పెంచుకొన్నాడు. ఆనాడు కూడా మా ఆశ్రమ ధర్మము ప్రకారము ఆకలిగొన్న వారికి అన్నము పెట్టాము. వారు అన్నము కావాలియని మా ఆశ్రమానికి వచ్చివుంటే అన్నము పెట్టాము. ఆయనకు సరిపోని వాళ్ళకు అన్నము పెట్టానని నా మీద కక్షపూనడము మంచిదో, చెడ్డదో మీరే ఆలోచించండి.

నీవు ఏ హోటల్‌లో కూడా వారికి భోజనము పెట్టకూడదని చెప్పివుంటే, హోటల్‌వాళ్ళు అందరూ భయపడి అన్నము పెట్టని సందర్భములో వారు రాత్రి 9 గంటలకు వచ్చి అన్నము అడిగితే అన్నము పెట్టడము తప్పు అని చెప్పడము వారికే చెల్లు. దుష్టులకు దూరముగా ఉండవలెనని దాదాపు పది సంవత్సరములు మేము కర్ణాటక ప్రాంతములో ఉండి 2003లో తాడిపత్రి సమీపములో చిన్నపొడమల యందు ఆశ్రమమును, కృష్ణమందిరమును స్థాపించి, ఎవరితోను సంబంధము లేకుండా నేను ప్రజలకు జ్ఞానమును పంచుతున్నాను. ఆశ్రమము జ్ఞాన ప్రచారము కొరకు పెట్టాను గానీ, దాని ద్వారా డబ్బు సంపాదించే దానికి కాదు. నాకు డబ్బు సంపాదించుటకు ఎన్నో వ్యాపారములు ఉన్నాయి. నేను సంపాదించినేది కూడా ఆశ్రమానికి, కృష్ణమందిరానికి పెట్టాను.

మొదటినుండి ఎవరితోను మేము చందాలు అడుగలేదని అందరికీ తెలుసు. అయినా చిన్నపొడమల గ్రామ సర్పంచ్ ద్వారా డబ్బులు అడిగితే నేను ఇవ్వను అన్నానని కొంతకాలము నుండి మమ్ములను అనేక విధముల ఇబ్బందులపాలు చేశాడు. ఈ మధ్య కాలములో ఈ ప్రాంత కమ్మ సంఘము వారు, వారి సంఘ నిర్మాణమునకు డబ్బులు అడిగితే నేను పదిమందికి ఉపయోగపడుతుందని కోటి రూపాయలు విరాళముగా ఇవ్వడము జరిగినది.

అలా ఇచ్చినది తెలిసి మేము అడిగితే ఇవ్వకుండా మీ సంఘానికి ఇస్తావాయను కక్షతో ప్రక్క గ్రామస్థులను పావులుగా వాడుకొని వారితో ఘర్షణ చేయించి మా మీద కేసులు బనాయించారు. దివాకర్ రెడ్డియే మా మీదికి ఉసికొల్పి అతనే ఆ ఊరివారిని అనంతపురమువారి చేత చంపించాడని మాకు నిదానముగా తెలిసినా పెద్ద పొడమల వారికి ఇంత వరకు తెలియదు. వారి డబ్బు కొరకు, అధికారము కొరకు మనుషులను బలిపశువులను చేస్తూ, తాను అన్ని సుఖములు అనుభవిస్తున్నాడని గ్రుడ్డి ప్రజలకు తెలియదు. తమకేదో మేలు చేస్తాడని నమ్మి, అతని మాటలు విని చాలామంది నష్ట పోవుచున్నారు. మా మెదడులో దేవుడు, పాపము, పుణ్యము అనునవి ఉంటే వారి మెదడులో దుర్మార్గము తప్ప ఏమీ లేదని ఆలోచించే ప్రజలకు తెలుస్తావుంది. స్థానిక ప్రజలకు మేము ఎటువంటి చెడు చేయకున్నా పెద్ద పొడమలలో కొందరు మాత్రము అతని మాటవిని నష్టపోవుచున్నారు. చిన్నపొడమల రైతులందరూ మాకు సానుకూలముగా యున్నా, పెద్ద పొడమలవారు అందరూ కాకుండా కొందరు మాత్రము వారి మాట విని మాకు వ్యతిరేఖముగా మారినారు.

J.C బ్రదర్స్ వారి బుద్ధి ఎటువంటిదో ఒక్కమాటలో అర్థము కాగలదు. నాకు రెండు వివాహములు అయినాయి, ఇద్దరు భార్యలున్నారు,

నలుగురు యుక్తవయస్సు కొడుకులున్నారు. ఒక భార్య అనారోగ్యముతో పుట్టింటిలో యున్నా, రెండవ భార్య ఎల్లప్పుడు నావద్దనే యుండి నాకు సేవలు చేయుచున్నది. నా వయస్సు 70 సంవత్సరములు ఇతరులు పట్టుకొంటే గానీ ధైర్యముగా నడువలేను. నాకు గుండెకు స్టంట్స్ కూడా వేశారు. 20 సంవత్సరాలుగా షుగర్, బి.పి ఉంది. చెవులు వినపడవు. స్వయముగా బాత్‌రూమ్‌కి కూడా పోలేని నన్ను గురించి మాట్లాడుచూ, వాని దగ్గర పండుకొనే వాళ్ళంతా గోపికలంట అని అనడము అతని సంస్కారము ఎటువంటిదో చూడండి. నాకున్న వయస్సు నీకు కూడా ఉంది. ఇది నీవు మాట్లాడవలసిన మాటయేనా అని అడుగుచున్నాను. ఇలాంటి మాటలు మాట్లాడు వారు ప్రజలకు రాజకీయ నాయకులా? వారికి ఓటు వేసి గెలిపించవచ్చునా? మీరు అడిగిన దానికి జవాబుగా అంతా ప్రపంచ విషయమే చెప్పాను. అట్లుకాకుండా ప్రజలకు ఉపయోగపడు ప్రశ్నలను అడగండి.

**ప్రశ్న :- ఈ ఘర్షణ జరిగిన కొద్దిరోజులకే ఐదారు మంది ముస్లీమ్‌లు మిగతా కులములవారు ప్రబోధానంద స్వామి అజ్ఞానమును బోధిస్తున్నాడని విలేకరుల ముందర ఆరోపణ చేశారు. ముఖ్యముగా ముస్లీమ్‌లు మాట్లాడుతూ ప్రబోధానంద స్వామి మా ఖుర్‌ఆన్‌ను అవమానపరిచాడు, రామాయణమును అవమానపరిచాడు అనడము వీడియోలో చూచాము. అట్లే కుల సంఘములు కూడా కొన్ని కులములను కించపరిచాడని అన్నారు, దీనిలో నిజమెంత? అని అడుగుచున్నాము.**

**జవాబు :-** అన్ని కులములు సమానమేయని కొన్ని సంవత్సరములుగా బోధిస్తున్నాను. చిన్న పెద్ద కులముల తేడాలు మనుషుల మధ్యలో ఉండకూడదని చెప్పడమేకాక, ఇప్పటికీ వందకు పైగా కులాంతర వివాహములను మా మందిరములోనే చేయడము జరిగినది. ప్రతి కులము వారు నాకు భక్తులుగా యున్నారు. అటువంటప్పుడు దివాకర్ రెడ్డితో డబ్బులు తీసుకొని బజారులో అరిచేవాళ్ళకే కులముల వివక్ష కనిపించిందా? తక్కువ కులము వారు మానసికముగా కులవివక్షతో బాధపడకూడదని నా వద్దకు చేరదీసి, నా వద్దనే పనులను కల్పించి అందరితో సమానముగా బ్రతికేటట్లు చేశాము. ఇది ప్రత్యక్షముగా ఉన్న విషయమే కదా! నోరు ఉందని ఏ ఆధారము లేకుండా మాట్లాడితే దేవుడు ఓర్చుకోడు, ప్రజలు ఓర్చుకోరు. ఇదంతా జె.సి.దివాకర్ రెడ్డి ఆడించే నాటకములని చాలామంది ప్రజలకు తెలుసు.

ఇకపోతే నేను ఆరు ఆధ్యాత్మిక సంస్థలను తయారు చేశాను. ఆరు సంస్థలకు నేను తండ్రిలాంటివాడను అని వారు చెప్పుకోవడము నేను కూడా విన్నాను. సువార్త క్రైస్థవ సంఘము క్రైస్థవులది కాగా, ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ ముస్లీమ్‌లది అయివున్నది. నా వద్ద ఎందరో ముస్లీమ్‌లు ఖుర్ఆన్ జ్ఞానమును తెలుసుకొన్నారు. అన్ని గ్రంథములు సమానమేయని చెప్పి ఖుర్ఆన్ గ్రంథమును 30 వేలమంది హిందువుల చేత చదివించి, అందులోని జ్ఞానమును తెలుసుకొనునట్లు చేశాను. అలా ప్రపంచములో ఏ గురువైనా చేశాడేమో చెప్పమనండి. ముస్లీమ్‌లు మాట్లాడుచూ ప్రబోధానంద స్వామి రామాయణమును కించపరిచాడు అనేది ఏమిటి? ఇది వాళ్ళు స్వయముగా మాట్లాడిన మాటకాదని, ఇతరులు మాట్లాడమంటే మాట్లాడారని తెలియుచున్నది. నన్ను ప్రజలలో చెడువానిగా చేయుటకు చేయు అనేక ప్రయత్నాలలో కుల, మత సంఘములతో చెప్పించడము

ఒక భాగమని మాకు మరియు అందరికీ తెలియుచున్నది. నేను ఇటువంటి తప్పు ఆరోపణలు చేయు కుల మత సంఘములకు చెప్పునదేమనగా! ఎవరో చెప్పమన్నట్లు మీరెందుకు చెప్పాలి. నేను వ్రాసిన గ్రంథములు మూడు మతములకు సంబంధించినవి నూరుకు పైగా గలవు. వాటిని చదివి నేను ఎటువంటివాడనో తెలిసి మాట్లాడండి. అట్లు తెలియకుండా సామాన్య మనుషులతో మాట్లాడినట్లు దైవజ్ఞానమును తెలిసిన వ్యక్తితో మాట్లాడితే అది దైవజ్ఞానమును కించపరచినట్లగును. అందువలన దేవుడు మిమ్మలను క్షమించడని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- మీరు దైవజ్ఞానమునే బోధిస్తూయుంటే B.J.P పార్టీ వాళ్లు, R.S.S వాళ్లు మిగతావారు మీ త్రైత సిద్ధాంతమును వ్యతిరేఖిస్తున్నారు కదా! ఈ మధ్య పది రోజుల క్రిందట B.J.P స్టేట్ ప్రెసిడెంట్ కూడా మేము త్రైత సిద్ధాంతమును అనుస రించడము వ్యతిరేఖిస్తాము అని అన్నాడు. అంతేకాక మీ పెద్ద కుమారున్ని B.J.P పార్టీలో భారీగా ఖర్చుపెట్టి చేర్చినా, వారు ఆయనను పార్టీలో కలుపుకోకుండా ప్రక్కన పెట్టారని విన్నాము. మీకెందుకు B.J.P వారు మద్దతు ఇవ్వడము లేదు.**

**జవాబు :-** నేడు ప్రతి రాజకీయపార్టీ రాజకీయముగా ప్రవర్తించడము లేదు. నీచకీయముగా ప్రవర్తించడము అలవాటైపోయింది. ఇటువంటి సమయములో దేశములో రాజకీయమే లేకుండా పోయి నీచకీయమే కనిపిస్తావుంది. 1993లో B.J.P వారికి మూడువందల మందికి ఉచితముగా అన్నము పెట్టాము. వారి మూలముగా నేటికి జె.సి.దివాకర్ రెడ్డి వాళ్ళతో శత్రుత్వము ఏర్పడినది. దానిని ఇప్పటికీ అనుభవిస్తున్నాము.

అటువంటప్పుడు అన్నము పెట్టిన వానిని మరచిపోయి నేడు మాటలు మాట్లాడు వారివెంట B.J.P వాళ్ళు పోయి త్రైత సిద్ధాంతమును గురించి మాట్లాడడము మంచో చెడ్డో మీరే ఆలోచించండి. అన్నము కొరకు వచ్చి మాకు శత్రుత్వము కల్పించిన రోజు మేము త్రైత సిద్ధాంతము వారని తెలియలేదా? అర్ధరాత్రి సమయములో జె.సి.దివాకర్ రెడ్డి వాళ్ళు నాకు ఫోన్ చేసి B.J.P వాళ్ళను వెంటనే బయటికి పంపమన్నప్పుడు, ఈ సమయములో నేను బయటికి పంపను అన్నప్పుడు, నా ధైర్యమునకు మెచ్చుకొన్నవారికి ఆ రోజు నేను త్రైత సిద్ధాంతకర్తనని తెలియదా? అవసరానికి ఆదినారాయణ, అవసరము తీరిన తర్వాత గూద నారాయణ అన్నట్లు B.J.P వారు ప్రవర్తించడము మంచిదేనా మీరే చెప్పండి.

1993 వ సంవత్సరము నేడు ఉపరాష్ట్రపతిగాయున్న వెంకయ్య నాయుడు ఆ రోజు B.J.P స్టేట్ ప్రెసిడెండ్‌గా యున్నారు. ఆ రోజు మధ్యంతర ఎన్నికల నిమిత్తము స్వయాన వెంకయ్యనాయుడు గారు, వారి కార్యకర్తలను B.J.P నాయకులను పంపగా మేము రాజకీయముతో సంబంధము లేకున్నా వారిని ఆదరించి, రక్షణ ఇచ్చి అన్నము పెట్టాము. అది మరచిపోయి నేడు క్రొత్తగా వచ్చిన కార్యకర్తల మాట విని మేము ఉపయోగపడనట్లు, నేడు ఒక్క రూపాయి కూడా ఖర్చుపెట్టని వారే నిజమైన కార్యకర్తలైనట్లు ప్రవర్తించుచున్నారు. ఇటువంటి రాజకీయము వలననే B.J.P పార్టీ ఆంధ్రరాష్ట్రములో పేరుకు మాత్రమున్నది. మేము హిందూ మతమునకు వ్యతిరేఖులమైనట్లు కొందరు కార్యకర్తలు చెప్పితే, త్రైత సిద్ధాంతము అంటే ఏమిటో వివరించి చూడకుండా, "మేము త్రైత సిద్ధాంతమును అనుసరించమని, వారి మద్దతు మాకు ఉండదని" చెప్పడము వలన మేమే దానినుండి బయటకు వచ్చాము. త్రైత సిద్ధాంతము హిందూ

మతములో అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతములాగ ఒక సిద్ధాంతము. దానిని అర్థము చేసుకోకుండా మాట్లాడే వారితో మాకు కూడా పని లేదు.

B.J.P పార్టీవారు ఒక గురువుగా యున్న మమ్ములను దూరముగా పెట్టి మాట్లాడడమునకు కారణము ఆ పార్టీలో బ్రాహ్మణుల ప్రాబల్యము ఎక్కువగా ఉండడమే అని తెలియుచున్నది. ఉత్తర దేశములో బ్రాహ్మణుల ప్రాబల్యము ఎక్కువగా ఉండడము వలన అక్కడ పార్టీ పుంజుకొన్నది. బ్రాహ్మణుడు ఒక్కడున్నా వారి తెలివితో మిగతా కులమువారిని తమకు అనుకూలముగా మార్చుకొనుట వలన అక్కడ పార్టీ పైకి రావడము, అధికారములోనికి రావడము జరిగినది. అయితే ఇక్కడ కూడా బ్రాహ్మణేతరులను అణచివేయడము, తమకు తొత్తులుగా యున్నవారిని పార్టీలోనికి చేర్చుకోవడము జరుగుతాయున్నది. B.J.P పార్టీ హిందూమతమును మాత్రము అనుసరిస్తూ మిగతా మతములను ద్వేషముగా చూడడము వలన దానికి మతతత్త్వ పార్టీయని ముద్ర పడిపోయినది. త్రైత సిద్ధాంతము ఆధ్యాత్మిక సిద్ధాంతము. ఆధ్యాత్మికరీత్యా మేము అన్ని మతములను సమానముగా చూడడము జరుగుచున్నది. దాని ఆధారముగా మమ్ములను పరమతము వారి క్రిందికి జమకట్టి కొందరు B.J.P వారు మాట్లాడడము, హిందూమతమును బలహీనపరచి ముక్కలు చేసినట్లు అవుచున్నది. వారికి సరిపోని వారు హిందూమతములోని వారయినా పరమతము ముద్రవేసి, వారిది హిందూమతము కాదని చెప్పడము వలన హిందూ మతము క్షీణించుచూ వచ్చుచున్నది.

భారతీయుడైన గౌతమ బుద్ధుడు తనకు తెలిసిన ఆధ్యాత్మికమును చెప్పితే, ఆ రోజు అశోకచక్రవర్తి అంతటివాడు కూడా ఆకర్షితుడై పోగా ఓర్వలేని హిందూస్వాములు, నాయకులు బుద్ధునిది హిందూమతము కాదని,

అతనిది బౌద్ధమతమని ప్రత్యేక పేరు పెట్టి చీల్చివేయడము వలన ఒక్కమారుగా హిందూమతము దాదాపు 40 శాతము క్షీణించిపోయినది. నలభై శాతము హిందువులు బౌద్ధులుగా విడిపోవునట్లు చేసినది హిందువులు కాదా! మేము హిందూ మతమును కాపాడుతామని చెప్పుచున్నవారు, హిందూ మత రక్షకులని పేరు చెప్పుకొంటున్నా హిందూ మత భక్షకులుగా తయారైనారు. వీరివలననే హిందూ మతము క్షీణించి పోవుచున్నదనుటకు బుద్ధున్ని పరమతస్థుడని చెప్పి చీల్చివేయడమే తార్కాణము అని చెప్పవచ్చును. నేడు త్రైత సిద్ధాంతము హిందూ ధర్మములోని భాగమయినా, త్రైత సిద్ధాంతము వేగముగా ప్రాకిపోవుచుండుట చూచి సంతోషపడక అసూయపడి, త్రైత సిద్ధాంతము వారిది హిందూమతము కాదు, వారిది ఇందూ మతము అని ప్రత్యేకమైన పేరు పెట్టి చెప్పుచున్నారు. ఇప్పుడు మమ్ములను కూడా హిందూ మతము నుండి బయటికి పంపితే ఒక్కమారుగా కొన్ని లక్షలమంది హిందువులను హిందూమతము కోల్పోయినట్లవుతుంది. దీనివలన వీరు హిందూమతమును రక్షించినట్లా, భక్షించినట్లా మీరే లెక్కవేసుకోండి.

మేము నేడు భగవద్గీతను ప్రచారము చేయుచున్నా మమ్ములను ప్రత్యేక మతమనువారు B.J.P పార్టీలో ఉండడము వలన ఈ పార్టీతో హిందూ మత క్షీణత తప్ప అభివృద్ధి ఉండదని చెప్పుచున్నాము. నేడు బౌద్ధమతము హిందూమతముతో సమానముగా యున్నది. అది నేడు హిందూమతములో కలిసియుంటే హిందూమతము ఎంత పెద్దదిగా కనిపించేది? విదేశములలో కూడా హిందూ మతము ఉన్నదని చెప్పుటకు అవకాశముండేది. బౌద్ధులు కాషాయము ధరించి ఎంతో ధర్మయుక్తముగా వారి బోధలను చెప్పుచున్నారు. వారిని వేరు మతమని చెప్పుటకు అవకాశమే లేదు. అయినా బుద్ధున్ని పరమతమని చెప్పిన ఘనత హిందువులకే దక్కింది. దీనిమూలముగా హిందూమతమును రక్షించినట్లా, నాశనము చేసినట్లాయని

మేము అడుగుచున్నాము. నేడు అన్ని విధముల మేము భగవద్గీతను గొప్పగా బోధిస్తున్నా, సిద్ధాంతమును చేర్చి త్రైత సిద్ధాంత భగవద్గీతను మేము రచించినా, మమ్ములను పరమతము క్రిందికి జమకట్టితే, మేము హిందువులము అని చెప్పుకొను మీకే నష్టము కాదా! అన్ని మతములకు భగవద్గీత ఆధారముగాయున్నదని దానిని చదవకపోతే ఏమీ ప్రయోజనము లేదని ఖుర్ఆన్ గ్రంథములో 62వ సూరా, 5వ ఆయత్‌లోను మరియు 5వ సూరా, 68వ ఆయత్‌లోను కలదని నిరూపించి చెప్పడము పరమతమవు తుందా? హిందూ మతమవుతుందా? మీరే ఆలోచించండి. ఒక ప్రక్క బైబిలు, రెండవ ప్రక్క ఖుర్ఆన్ గ్రంథము తౌరాత్ అను పేరుగల భగవద్గీతను పొగడుచున్నాయని, ఇతర గ్రంథములలో కూడా భగవద్గీతను చూపిన నేను పరమతస్థుడినని చెప్పడము, నేడు హిందూ సమాజమునకు తగదని చెప్పు చున్నాము. అటువంటి హిందూ సమాజమును నెత్తికి ఎత్తుకున్న B.J.P కి కూడా మంచిది కాదని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- ఈ మధ్య టీ.వీ ఛానళ్ళలో చర్చలకొచ్చిన స్వామీజీ లందరూ మిమ్ములను ఎవరూ సమర్థించలేదు. మీరు హిందూ మత ముసుగులో అజ్ఞానమును బోధిస్తూ హిందూ సాంప్ర దాయములను, హిందూ జ్ఞానమును మంటగలుపుచున్నారని అన్నారు. సామాన్య ప్రజలుకాక స్వామీజీలే అట్లన్నారంటే మీలో ఏదో లోపమున్నట్లే. మీది సరైన జ్ఞానమయినప్పుడు వారు ఎందుకు అలా అంటున్నారు?**

**జవాబు :-** జ్వరము ఎంత ఉంది అని తెలియుటకు థర్మామీటరు ఉంది. అట్లే పాలలో నీటి శాతము ఎంత ఉంది అని తెలియుటకు దానికి

సంబంధించిన డిగ్రీమీటర్ ఉంది. అలాగే ప్రపంచములో ఎన్నో విషయములను తెలియుటకు ఎన్నో పరీక్ష సాధనములు గలవు. అట్లే దేవుని జ్ఞాన విషయములో ఎవరిది సరియైన జ్ఞానము అని తెలియుటకు శాస్త్రము ఆధారముగా కలదు. దేవుని జ్ఞాన విషయములలో బ్రహ్మ విద్యా శాస్త్రము ప్రమాణ గ్రంథముగా యున్నది. ఇప్పుడు బ్రహ్మవిద్యా శాస్త్రము ఏది? అను ప్రశ్న చాలామందికి యున్నది. బ్రహ్మవిద్యా శాస్త్రమును గురించి ఒక గురువును అడిగితే వేదములే బ్రహ్మ విద్యాశాస్త్రము అని అన్నాడు. ఇంకొక స్వామి వద్దకు పోయి అడిగితే ఉపనిషత్తులే బ్రహ్మవిద్యా శాస్త్రము అని అన్నారు. ఇంకొక ఆధ్యాత్మికవేత్త అనునతని వద్దకు పోయి అడిగితే అదేదో నాకు తెలియదు అన్నాడు. ఇంకొక సాధువు దగ్గరికి పోయి అడిగితే అది పూర్వము ఉండేది ప్రస్తుత కాలములో అది ఎక్కడా లేదు అని చెప్పాడు. ఈ విధముగా ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా చెప్పడము వలన దానిని గురించి ఉందా లేదా అను అనుమానము వచ్చినది.

ఏ విషయమునకైనా శాస్త్రమే ప్రమాణము. శాస్త్రము వలననే సత్యమా కాదా!యని తెలియబడుతుంది అని చాలామంది చెప్పుచున్నారు. ఇది ఇట్లుండగా గృహ విషయములను తెలియుటకు వాస్తుశాస్త్రము, వంటను గురించి తెలియుటకు పాకశాస్త్రము, దేవాలయములకు ఆగమ శాస్త్రము తయారయినాయి. వాటి విషయములు సక్రమముగా తెలియాలంటే వాటికి సంబంధించిన శాస్త్రములను చూడాలని అంటారు. అసలుకు శాస్త్రమంటే ఏమిటి? అని ప్రశ్నించుకొని చూస్తే శాసనములతో కూడుకొన్నది శాస్త్రము అని చెప్పవచ్చును. హేతుబద్దముగా కనిపెట్టి నిర్ణయించిన సిద్ధాంతములను శాసనములతో తయారు చేయబడినది శాస్త్రము అని తెలియుచున్నది. అలాగే ఒక శాస్త్రము ఉంది అంటే దానికి ఒక కర్తయుంటాడు. ప్రపంచములో సిద్ధాంతమునకు పరిశోధకుడయిన సిద్ధాంతకర్త యుంటాడు

గానీ, పూర్తి శాస్త్రమును తయారు చేసిన మనిషి ఎవడూ ఉండడు. ప్రతీ శాస్త్రము వెనుక దేవుడే శాస్త్రకర్తగా ఉంటాడుగానీ మనుషులు ఉండరు.

ఇప్పుడు శాస్త్రములు ఎన్ని, శాస్త్రములు ఏవి అను ప్రశ్న వచ్చు చున్నది. దానికి జవాబుగా ఇట్లు చెప్పవచ్చును. శాస్త్రములు ఆరుయని, పురాణములు 18యని పూర్వము నుండి చెప్పడము వింటున్నాము. షట్ శాస్త్రములు, అష్టాదశ పురాణములని వాటిని గ్రంథరూపకముగా తయారు చేసిన వ్యాసుడే చెప్పాడు. ఆ లెక్కప్రకారము ఆరు శాస్త్రములను కూడా వరుసగా 1) గణిత శాస్త్రము 2) ఖగోళ శాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) జ్యోతిష్య శాస్త్రము 6) బ్రహ్మ విద్యాశాస్త్రము అని చెప్పవచ్చును. ప్రపంచములో ఇవి ఆరే శాస్త్రములు అయినప్పుడు వాస్తు శాస్త్రము, పాక శాస్త్రము, ఆగమ శాస్త్రము అని చెప్పుచూ పోతే చాలా శాస్త్రములున్నవి కదా! వీటిని ఏమనాలి. ఆరే శాస్త్రములయినప్పుడు మిగతావి శాస్త్రములు కాదా! శాస్త్రములు కానప్పుడు వాటికి శాస్త్రము అని ఎందుకు పేరు పెట్టారు. ఆరు శాస్త్రములను వ్యాసుడు పేర్లు పెట్టి వ్రాయగా, మిగతా ఎన్నో శాస్త్రములను ఎవడు వ్రాశాడు అని ప్రశ్నించితే జవాబు ఇలా ఉన్నది.

రాళ్ళలో లోపల వెలుగుండే చిన్న చిన్న రాళ్ళుంటాయి. వాటిని వజ్రాలు అని అంటాము. అలాగే రాళ్ళలోనే బయట వెలుగువుండే అనగా బయట మెరిసే రాళ్ళుంటాయి. వాటిని సూదిముక్కు రాళ్ళు అంటాము. అలాగే వజ్రాలలాంటివి ఆరు శాస్త్రములుకాగా, సూదిముక్కు రాళ్లలాంటివి మిగతా శాస్త్రములు. షట్ శాస్త్రములు స్వయముగా దేవుడు అందించినవి. మిగతా శాస్త్రములు ఎన్నియున్నా వాటిని మనుషులు వారి ఇష్టప్రకారము వ్రాసుకొన్నవేయని చెప్పవచ్చును. ఇప్పుడు లెక్కలు చూడాలి అంటే గణిత

శాస్త్రమును చూడాలి. భవిష్యత్తును తెలియాలి అంటే జ్యోతిష్య శాస్త్రమును చూడాలి. శరీర వివరమును తెలియాలి అంటే భౌతిక శాస్త్రమును చూడాలి. అలాగే దైవజ్ఞాన విషయములలో ఏది సత్యము, ఏది అసత్యము అని తెలియుటకు, అట్లే ఎవడు నిజమైన జ్ఞాని, ఎవడు కాదు అని తెలియుటకు బ్రహ్మవిద్యా శాస్త్రమును చూడవలసియుంటుంది.

భూమిమీద బ్రహ్మవిద్యా శాస్త్రము ఏది అంటే అది ఆ పేరుతో ప్రత్యేకమైనదిగా లేకున్నా వేరొక పేరుతో యున్నదని తెలియుచున్నది. భగవద్గీతలో ప్రతి అధ్యాయము చివరిలో **బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే**యని చెప్పబడియున్నది. దానినిబట్టి భగవద్గీతను బ్రహ్మవిద్యా శాస్త్రముగా చెప్పవచ్చును. అయినా వ్యాసుడు చెప్పినది వాస్తవమేనా, ఆయన మాట ప్రకారము భగవద్గీత బ్రహ్మవిద్యా శాస్త్రమేనాయని కూడా ప్రశ్న రావచ్చును. భగవద్గీత బ్రహ్మవిద్యా శాస్త్రమని చెప్పుటకు వేరే ఆధారము ఏమయినా ఉందేమో అని చూస్తే, అది నిజమేయని చెప్పుటకు కొంత ఆధారము అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌లో దొరుకుచున్నది. ఖుర్ఆన్ గ్రంథము గురించి ముస్లీమ్‌లకే సరిగా తెలియదు. అటువంటిది హిందువులకు దానిలోనిది ఎలా తెలుస్తుంది. నేడు పరమతము అనగానే అసూయ బుసలుకొడుతున్నది. ముస్లీమ్‌లను చూస్తే హిందువులకు సరిపోదు. హిందువులను చూస్తే ముస్లీమ్‌లకు సరిపోదు. వాస్తవానికి ఖుర్ఆన్ ఒక దైవ గ్రంథమని హిందువులు ఏమాత్రము అనుకోవడము లేదు. అట్లే భగవద్గీతను చూస్తే ఇది ప్రథమ దైవగ్రంథమని ముస్లీమ్‌లు అనుకోవడము లేదు. ఇంకొక పెద్ద రహస్యము ఏమనగా! ఖుర్ఆన్‌లో వ్రాసిన తౌరాత్ అను పేరుగల గ్రంథమే నేడు మనవద్దగల భగవద్గీతయని ఇటు హిందువులకుగానీ, అటు ముస్లీమ్‌లకుగానీ తెలియదు.

ఖుర్‌ఆన్ గ్రంథములో బైబిలుకు, ఖుర్‌ఆన్‌కు భగవద్గీతలోని జ్ఞానమే ఆధారమని చెప్పడము, ఈ రెండు గ్రంథములు తౌరాత్‌ను (భగవద్గీతను) ధృవీకరించుచున్నాయని చెప్పడము జరిగినది. అంతేకాక తౌరాత్ గ్రంథమును చదువకపోతే వాడు ఏ మత ధర్మములోను లేనట్లేయని కూడా చెప్పారు. భగవద్గీత ఆధ్యాత్మిక విద్యకు ప్రమాణ గ్రంథమని చెప్పుటకు ఖుర్‌ఆన్‌లో ఏమి చెప్పారో ఒకమారు చూడండి.

**(62-5) "తౌరాత్ గ్రంథము ప్రకారము ఆచరించాలని ఆదేశించినప్పటికీ దానికి అనుగుణముగా అనుసరింపని వారు ఎన్ని గ్రంథములను అనుసరించినా ప్రయోజనము లేదు. అటువంటి వారిని ఎన్నో గ్రంథములను వీపుమీద మోయు గాడిదలాంటివారని ఉపమానముగా చెప్ప వచ్చును"**

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాత్‌ను (భగవద్గీతను), ఇంజీలును (బైబిలును) మీ ప్రభువు తరఫున మీ వద్దకు పంపబడిన ఖుర్‌ఆన్ గ్రంథమును మీ జీవితములలో నెలకొల్పనంతవరకు మీరు ఏ ధర్మము పైనా లేనట్లే."**

**(5-46) "ఆ ప్రవక్తల తర్వాత మేము మర్యమ్ (మరియమ్మ) కుమారుడు ఈసాను (ఏసును) పంపాము. అతను తనకు పూర్వము వచ్చిన తౌరాతు గ్రంథమును సత్యమని ధృవీ కరించేవాడు. మేము అతనికి ఇంజీలు (బైబిలు)**

**గ్రంథమును ఇచ్చాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉండేవి. అది తనకు ముందున్న తౌరాత్ గ్రంథమును ధృవీకరించేది. అంతేకాక అది దైవభీతి కలవారికి మార్గదర్శినిగా, హితబోధినిగా ఉండేది."**

**(5-44) "మేము తౌరాతు గ్రంథమును అవతరింపజేశాము. అందులో మార్గదర్శకము, జ్యోతి ఉన్నాయి. ఈ తౌరాతు గ్రంథము ఆధారముగానే దేవుని మీద విశ్వాసము గల ప్రవక్తలు, రబ్బానీలు, ధర్మవేత్తలు, యూదుల సమస్యలను పరిష్కరించేవారు."**

ఇక్కడ చెప్పిన నాలుగు వాక్యములు (ఆయత్‌లు) అర్థమగుటకు తౌరాతు అనగా భగవద్గీతయని అర్థము చేసుకోవలసియున్నది. 'తౌ' అనగా మూడు అని అర్థము, 'రాత్' అనగా రాత్రిళ్ళు అని అర్థము. "తౌరాతు" అనగా మూడు రాత్రులని అర్థము. రాత్రి అనగా చీకటిగా యుండేది. ఏమీ కనిపించనిది యని చెప్పవచ్చును. ఆత్మ అనగా తెలియబడనిది కావున ఆత్మను రాత్రిగా పోల్చి కనిపించునది కాదని చెప్పారు. త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతలో చెప్పిన మూడు ఆత్మలను మూడు రాత్రులుగా పోల్చి "తౌరాతు" యని చెప్పారు. మూడు ఆత్మలను గురించి చెప్పిన గ్రంథమును మనుషులు భగవద్గీతయని చెప్పారు. అదే భగవద్గీతను మోషే ప్రవక్తకు స్వప్నములో కృష్ణుడు స్వయముగా ఇచ్చినప్పుడు ఇచ్చిన గ్రంథము పేరు తౌరాతుయని ఆయన స్వయముగా పేరు పెట్టి ఇచ్చాడు. ఈ విషయములన్నియు **"కృష్ణమూస"** అను మా గ్రంథములో వ్రాయబడి యున్నవి. మొట్టమొదట వ్రాయబడిన గ్రంథమును వ్రాసిన వ్యాసుడు

భగవద్గీతయని పేరు పెట్టగా భగవద్గీతను చెప్పిన కృష్ణుడు స్వయముగా తౌరాత్‌యని పేరు పెట్టాడు. ఇదంతయు ఎవరికీ తెలియకుండా జరిగిన విషయము. అందువలన తౌరాతు యనగా మూడు తెలియని ఆత్మలని అర్థము చేసుకోవలసియున్నది. భగవద్గీతలో కూడా మూడు ఆత్మల విషయమునే చెప్పారు. దీనినిబట్టి తౌరాతు, భగవద్గీత రెండూ ఒక్కటేయని చెప్పుచున్నాము.

ఇదంతయు గమనించిన తర్వాత ఆధ్యాత్మిక విద్యకు ప్రమాణ గ్రంథము భగవద్గీతయని తెలియుచున్నది. ఎవరయినా దైవజ్ఞాన విషయములో ఏది సత్యము, ఏది అసత్యము అని తెలియుటకు భగవద్గీతను ప్రమాణ గ్రంథముగా తీసుకొని చూడవలసి యున్నది. నేడు హిందూ మతములోని స్వాములు ఒక్క భగవద్గీతను కాకుండా కొందరు వేదములను, కొందరు ఉపనిషత్తులను, కొందరు పురాణములను, కొందరు ఇతిహాసము లను ఆధారము చేసుకొని వారు చెప్పుమాటలే నిజమైన జ్ఞానము అని అంటున్నారు. అందువలన మిగతా స్వామీజీలు చెప్పే జ్ఞానమును బ్రహ్మ విద్యా శాస్త్రమయిన భగవద్గీతతో పోల్చి చూడవలసియున్నది. అలా చూస్తే వారు చెప్పేది నిజమైన జ్ఞానమా కాదాయని తెలియును. నేడు భగవద్గీతను చదివిన స్వాములకు కూడా అందులోని నిగూఢ జ్ఞానము అర్థముకాక గీతలో ఒకటి చెప్పివుంటే మరొక దానిని వారు అర్థము చేసుకోవడము జరిగినది. అటువంటప్పుడు నేను అంతిమ దైవ గ్రంథమయిన ఖుర్‌ఆన్ కూడా పొగిడిన తౌరాతు (భగవద్గీత) ప్రమాణముగా తీసుకొని ఏది జ్ఞానమో దానినే అనుసరిస్తూ, ఏది జ్ఞానము కాదో దానిని వదలివేయుచున్నాము. శాస్త్రము సమర్థించని దానిని లోకములో యుండే వారందరూ సమర్థించి ననూ, నేను మాత్రము దానిని ఆచరించడము లేదు. ఊరందరూ ఒక

దారిలో నడిస్తే నేను అందరికీ వ్యతిరేఖమయినా ఫరవాలేదని శాస్త్రమును అనుసరించి, బ్రహ్మవిద్యా శాస్త్రములో సూచించిన దానినే అనుసరించు చున్నాను.

ఇంజీలు (బైబిలు) అంతిమ దైవగ్రంథమయిన ఖుర్‌ఆన్ సమర్థించు నట్టి తౌరాత్ (భగవద్గీత) ను పరిశోధించి అందులోని నిజమైన భావమును గ్రహించి, అందులో సర్వమానవులకు, సర్వమతములవారికి చెప్పిన జ్ఞానమును నేను గ్రహించి, నాయందు సరియైన జ్ఞానము ఉండునట్లు చేసుకొన్నాను. నేడు మానవులు ఏదో ఒక మత సాంప్రదాయమును అనుసరిస్తూ తమదే నిజమైన జ్ఞానము అని అనుకొంటున్నారు. భూమిమీద ప్రతి మనిషి మతము అను మత్తులో మునిగియున్నారు. ఎవరు మాట్లాడినా వారి వారి మత సాంప్రదాయములను మాట్లాడుచూ అదే నిజమైన జ్ఞానమని అంటున్నారు. నిజమైన దేవుని జ్ఞానము మనుషుల మధ్య భేదములను కల్గించదు. ఏ మనిషిలో అయినా ఒక్కటేయుండును. అట్లు కాకుండా నేడు మనుషుల మధ్యలో భేదములు కల్గించు జ్ఞానమే ఉండుట వలన అది శాస్త్రబద్ధమైన జ్ఞానము కాదని తెలియుచున్నది. ప్రపంచములో పన్నెండు మతములున్నా అందులో మూడు మతములే పెద్దవి. అంతేకాక ఈ మూడు మతములందే దేవుడు తన దైవగ్రంథములను ఇచ్చాడు. ఒక్కొక్క మతము ఒక్కొక్క దైవ గ్రంథమును మాదియని చెప్పుకుంటున్నా ఆ దైవ గ్రంథములోని జ్ఞానమును పూర్తి గ్రహించుకోలేకున్నారు. అందువలన గ్రంథములోని జ్ఞానము కాకుండా మతములోని సాంప్రదాయములే వారియందు ఎక్కువగా ఇమిడిపోయాయి. మత సాంప్రదాయములకు దేవుడు, దేవుని జ్ఞానము దూరముగా ఉంటుంది. అటువంటివారు దైవ గ్రంథములను అనుసరిస్తూ, మూడు దైవ గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదని

చెప్పుచున్న మమ్ములను విమర్శిస్తూ, మేము చెప్పునది జ్ఞానము కాదని అంటున్నారు.

హిందూ మతమునకు వ్యతిరేఖముగా బోధిస్తున్నాడని, హిందూ మతమును నాశనము చేస్తున్నాడని నన్ను అంటున్నారు. ఎవ్వరు ఏమనినా నేను ఏ మతమునకు వ్యతిరేఖిని కాను. ఇతర మతములయిన ఇస్లామ్, క్రైస్థవ మతములకు కూడా నేను వ్యతిరేఖిని కాను. వారిలో ఉండే అజ్ఞానమునకు వ్యతిరేఖముగా నా బోధలుంటాయి గానీ వారు మాది అని చెప్పుకొను దైవగ్రంథములోని జ్ఞానమునకు నేను ఎప్పుడూ వ్యతిరేఖముగా చెప్పలేదు. హిందూమతములో పుట్టిన నేను, హిందూ మతములో ఏదయినా లోపము ఉంటే సరిచేయాలని చూస్తాముగానీ, హిందూ మతమునకు వ్యతిరేఖముగా ఎందుకు ఉంటాము? నన్ను ఎందుకు కొందరు అట్లు చెప్పుచున్నారనుటకు ఒక విషయమును ఉదాహరణగా చెప్పుచున్నాను మీరు గమనించండి. నేడు మనది హిందూ మతము అని అంటున్నారు. ఎవరో ఒకరంటే మిగతావారు దానిని కొద్దిగా అయినా ఆలోచించకుండా అట్లే అంటున్నారు. వాస్తవముగా చరిత్రలోనికి పోయి చూస్తే ఆ పేరు మనకు లేదు. ఆ పేరు అర్థము లేని పేరు. హిందూ అనేది ఏ డిక్షనరీలో లేదు. అర్థము లేని పదమును పెట్టుకొని అది మన మతము అనడము మనకు అవమానకరము అని చెప్పాము. వాస్తవముగా మన మతము పేరు పూర్వము ఇందూ అనే శబ్దముతో యుండేది.

ఇందూ అను పదము కాలక్రమమున హిందూగా మారియుండ వచ్చును. దీని పోలికగా ఒక విషయమును చెప్పుకొందాము. హిందూ దేశమునకు పూర్తి దక్షిణ భాగమున లంక అను దేశము గలదు. అది పూర్వము నుండి అదే పేరుతోనే ఉంది. ఒకవేళ కాలక్రమమున లంక

అను పేరు కొంత మార్పు చెంది ఇందూ హిందూగా మారినట్లు లంక కాస్త లంగాగా మారినదనుకో. ఎవడయినా నోరు తిరగనివాడు లంక అనునది పోయి లంగా అని పలికితే దానిని ఎవరూ ఒప్పుకోరు. లంక అనగా నీటిలో తేలునదని, చుట్టూ నీరున్నదని అర్థము కలదు. దానిని లంగా అనడములో పూర్తి భావము లేకుండా పోతుంది. ఆ పేరులో ఉండే అర్థమునకు పూర్తి భంగము వాటిల్లుతుంది. అలాగే ఇందూ అనగా జ్ఞానము లేక జ్ఞాని అని అర్థము. ఇందూ దేశము అనగా జ్ఞానుల దేశము అని అర్థము. అలాంటిది ఇందూ అని చెప్పక హిందూ అని చెప్పడము వలన అంతకుముందు యున్న అర్థము పోయి అర్థము లేని పదముగా మిగిలి పోవుచున్నది. నేడు ఎట్లున్నా పూర్వము మన దేశము పూర్తి జ్ఞానము కల్గియుండుట వలన మన దేశమును ఇందూ దేశము అని అన్నారు. ఈ పేరు భూమిమీద మతములు లేనప్పుడే ఉండేది. మన దేశమునకు మతమును బట్టి పేరు రాలేదు. జ్ఞానమును బట్టి ఇందూ దేశమని పేరు వచ్చినది. అటువంటిది నేడు మన మతమునకు సంబంధించిన పేరే దేశమునకు కలదని చెప్పుకుంటున్నాము. వాస్తవముగా చెప్పితే లంక దేశమును లంగా దేశమన్నా అది ఒక అర్థము క్రిందికి వస్తుంది. ఇందూ దేశమును హిందూ దేశమనడములో ఏమాత్రము అర్థములేనిదై పోవుచున్న దని మొదటి నుండీ చెప్పుచున్నాము. అలా చెప్పడము హిందూ మతమునకు వ్యతిరేఖముగా చెప్పినట్లాయని అడుగుచున్నాను. నేను ఒక్కనినే హిందూ అంటే అర్థము లేని పదము అని చెప్పడము లేదు. హిందూ అనే పదానికి నిర్వచనము తెలియదని 12.10.2015 తేదీన సాక్షి పత్రికలో అనంతపురము ఎడిషన్‌లో వచ్చింది. కావలసియుంటే ఆ దిన పత్రికలో ఇట్లు వ్రాశారు చూడండి.

## 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తేల్చింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు. (తేది:12.10.2015, సాక్షి న్యూస్‌పేపరు)

అట్లే ఇది హిందూ దేశము కాదు ఇందూ దేశము అనుటకు కూడా నెహ్రూ తన కూతురు ఇందిరకు వ్రాసిన లేఖలో స్పష్టముగా తెలియుచున్నది.

# ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్య పర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందూదేశమని పేరు వచ్చింది. ఇందూ దేశమే హిందూ దేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణంకంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబ కలహమే భారత కథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం. మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని వ్రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

– నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలో నుంచి...

ఈ విధముగా మనము హిందువులము కాము ఇందువులము అని చెప్పితే, నేను చెప్పినది అజ్ఞానము అని కొందరు అనడములో అర్థమే లేదు. సామాన్య ప్రజలు తెలియనిది చెప్పితే వింటారు, అర్థము చేసుకొంటారు. అయితే కొందరు పండితులు, స్వాములు మేము తెలిసిన వారము అను అహము చేత వారు చెప్పినదే జ్ఞానమనీ, ఇతరులు చెప్పినది జ్ఞానము కాదని చెప్పడమేకాక, సత్యము చెప్పిన వారిని అజ్ఞానులనుట వారి పనిగా యున్నది. అదే విధముగా నన్ను కూడా వారు అజ్ఞానమును బోధిస్తున్నాడని చెప్పారు.

**ప్రశ్న :- హిందువులకు ఎన్నో పండుగలు గలవు. అందులో కొన్ని పండుగలు ఇళ్ళలోనే చేసుకోగా, కొన్ని పండుగలు బహి రంగముగా చేయుచూ ఊరేగింపులు మొదలగునవి చేయు చుందురు. అటువంటి పండుగలలో వినాయక చవితి బయట ఊరేగింపు చేయు పండుగగా యున్నది. వినాయక ఊరేగింపులు చిన్నగా ఉండడమేకాక భారీగా కూడా యుండును. ఎవరి స్థోమతకొద్ది వారు చేయుదురు. అటువంటి సాంప్రదాయ పండుగకు మీరు పూర్తిగా వ్యతిరేఖము అని విన్నాము. ఈ మధ్య కాలములో ఊరేగింపులోని వినాయక విగ్రహములను పగులగొట్టి ఊరే గింపులో యున్న వారిని తరిమివేసారని విన్నాము. మీరు చేయక పోయినా ఫరవాలేదు. అయితే భక్తిగా చేసుకొను వారిపై దాడి చేయడము, వినాయక ప్రతిమలను పగుల గొట్టడము దేనికి అని అడుగుచున్నాము. ఇట్లు చేయడము హిందువులకు వ్యతిరేఖము చేసినట్లు కాదా!యని అడుగుచున్నాము.**

**జవాబు :-** వినాయక పండుగను గురించి గతములో అందరికీ అర్థమగు లాగున చెప్పియున్నాను. వినాయక విగ్రహములను ఊరేగింపు చేయమని చెప్పానుగానీ, చేయకూడదని నేను ఎప్పుడూ చెప్పలేదు. ఊరేగింపు చేయడము చివరకు, విగ్రహమును పగులగొట్టి నీటిలో వేయడము వరకు చేయవలసిన పనియే అని చెప్పాను. అలాగే పూర్వము చేసెడివారనీ, నేడు ఆ విధముగా చేస్తున్నా పూర్వమునకు ఇప్పటికీ మనుషుల భావములో తేడా యున్నదని చెప్పాము. పూర్వము వినాయక చవితి సామాజిక న్యాయమును తెలియజేయునదిగా ఉండగా, నేడు ఆ భావము పోయి వినాయకుడు దేవుడు అను భావము వచ్చినది, అలా వినాయకుడు ఒక దేవుడు అని భావించి పూజలు చేయడము మంచిది కాదని చెప్పాను. పూర్వము ఏ పనిని చేసినా మన పెద్దలు ఎంతో ఉన్నతమైన భావముతో చేసెడివారు. అలాగే నేడు మనము చేసే వినాయక పండుగకు, పూర్వము పెద్దలు చేసిన వినాయక పండుగకు భావములో ఎంతో తేడాయుండేది. పూర్వము చేసిన భావముతో వినాయకుని ఊరేగించమని చెప్పానుగానీ, అసలుకు ఆ పండుగే చేయకూడదని నేను ఎక్కడయినా చెప్పానాయని అడుగుచున్నాను.

ఈ విషయమై చిన్న ఉదాహరణను చెప్పుచున్నాను చూడండి. అలా చెప్పడము వలన నేను చెప్పే విషయము మీకు బాగా అర్థము కాగలదు. పూర్వము అందరూ మల విసర్జనకు దూరముగాయున్న బయలు ప్రాంతము లోనికి పోయేవారు. నివాసమునకు కొంత దూరముగా యున్న బయలు ప్రాంతములో చెట్లచాటునో, గుంతల చాటునో కూర్చొని తమ పని ముగించు కొని వచ్చెడివారు. అట్లు పోయేటప్పుడు మలవిసర్జన అయిపోయిన తర్వాత శుభ్రము చేసుకోవడానికి పెద్ద చెంబులతోనో, ముంతలతోనో, డబ్బాలతోనో లీటర్ నుండి రెండు లీటర్ల వరకు నీటిని తీసుకొని పోయేవారు. చేతనయిన

వాళ్ళు నడిచిపోయేవాళ్ళు, నడిచే దానికి చేతకాని వాళ్ళు గుర్రము మీదనో లేక చిన్నపాటి ఒంటిఎద్దు బండి మీదనో పోయి వచ్చెడివారు. అది అందరికీ తెలిసే పనికాదు, తెలియజేయవలసిన అవసరము లేదు. అందువలన ఎవరి ఉపాయము కొద్ది వారు పోయి వచ్చెడివారు, చేసే పనినిబట్టి కొన్ని పనులకు ప్రచార ఆర్భాటాలు అవసరముండదు. పూర్వము సౌకర్యములు లేని కాలములో అలా పోయేవారు నేడు అన్ని సౌకర్యములున్న కాలములో ఇళ్ళలోగానీ, ఇల్లు సమీపములోగానీ చిన్న రూములు కట్టించుకొని అందు లోనికి పోయి మలవిసర్జన చేసిరావడము అందరికీ తెలిసిన విషయమే.

నేడుగానీ, పూర్వముగానీ మలవిసర్జనకు పోవువారు ఇతరులకు తెలియునట్లు డోలు, మేళములు వాయించుకుంటూ ఊరేగింపుగా (ఊరు ఎరిగింపుగా) అందరికీ తెలిసే రకముగా ఎవరూ పోరు. అది ఇతరులకు తెలియవలసిన విషయము కాదు. అయితే నేడు పెద్ద ఊరేగింపులతో బహిర్భూమికి పోవడము ఎవడయినా చేస్తే వానిది తెలివితక్కువ పనియని చెప్పక తప్పదు. అలాగే వినాయక ఊరేగింపు చేయవలసిందే గానీ, దేవుడు అని చేస్తే అది దొడ్డికి (మలవిసర్జనకు) ఊరేగింపుగా పోయినట్లగును. వినాయక నిమజ్జనము రోజు ఆ విషయమును అనగా నిమజ్జనమును అందరికీ తెలియజేయవలెను. కావున వినాయకున్ని ఊరేగింపుగా తీసుక పోవలసిందే. అంతేగానీ వినాయకున్ని దేవుడు అని అనుకోవడము మల విసర్జన పవిత్ర కార్యము అన్నట్లుండును. మలవిసర్జనకు ముందు ముడ్డి పూజ చేయవలెనన్నట్లుండును. అందువలన ఏ కార్యమును ఏ భావముతో చేయవలెనో ఆ భావముతోనే చేయవలెనుగానీ, ఇంకొక భావముతో చేస్తే అది విడ్డూరముగా ఉండును. పూర్వము వినాయక నిమజ్జనము ఉన్నది, వినాయక ఊరేగింపు యున్నది. అయితే భక్తి భావముతో వినాయక పూజలు

చేయడముగానీ, వినాయకున్ని దేవుడు అనడముగానీ ఏమాత్రము లేదు. అదే విషయమునే నేను భావయుక్తముగా చెప్పాను గానీ, వినాయక నిమజ్జనము చేయకూడదని నేను ఎప్పుడూ చెప్పలేదు. వినాయకుడు దేవుడు అంటే ముడ్డికి పూజ చేయాలి అన్నట్లుంటుంది.

వినాయక నిమజ్జనము గురించి పూర్తి వివరాలలోకి పోతే నాయకుడు అంటే ఒక గుంపుకు అధిపతి లేక కొంతమందికి పెద్దగా యున్నవాడు అని చెప్పవచ్చును. నాయకుడు చాలా పెద్దవాడు అని విశేషతను చూపుటకు "వి" అను అక్షరమును చేర్చి వినాయకుడు అని చెప్పవచ్చును. నాయకుడు గానీ, గొప్ప నాయకుడు (వినాయకుడు) గానీ మనుషులలోనే ఉందురు. నాయకుడుగా కొందరుండవచ్చును. విశేషమైన నాయకత్వమును కల్గినవారు అరుదుగా ఉందురు. అనగా నాయకులలోనే గొప్ప నాయకులను **వినాయకులు** అనేవారు. సమాజములో ఎంతోమంది మనుషులకు పెద్దగాయున్న వానిని నాయకుడు అనేగాక వినాయకుడు అని పిలువవచ్చును. ప్రజలు బలహీనులుగాయున్నప్పుడు వారికంటే ఎక్కువ ధనము, అధికారము రెండూ ఉండి ప్రజలను భయపెట్టి తన మాట వినునట్లు చేసుకొనువానిని వినాయకుడు అని అనవచ్చును. పూర్వము కృత యుగములో జ్ఞానము కల్గిన మనుషులు ఉండుట వలన పేద ధనిక భేదము లేకుండా సమానముగా యుండేవారు. అట్లే త్రేతాయుగములో (త్రైతాయుగములో) కొంత పాపభీతి యుండుట వలన మనుషులలో కొందరు ధనబలము, అధికారబలము కల్గియున్నా దానిని బయటి ప్రజల మీద ఉపయోగించక ప్రజలతో నాయకులు కలిసిపోయేవారు, కనుక త్రైతాయుగములో కూడా పేదా ధనికా, చిన్నా పెద్దా, బలహీనుడు బలవంతుడు అను తేడాలు లేకుండా గడచిపోయినది.

త్రైతాయుగము గడచిపోయిన తర్వాత ద్వాపరయుగములో మనుషులయందు అజ్ఞానము ఎక్కువగా పెరిగిపోతూ వచ్చినది. అప్పుడు మనుషులలో పేదా ధనిక, బలహీనుడు బలవంతుడు అను తేడాలు వచ్చాయి. అప్పుడు ప్రజలలో నాయకులు కొందరు, వినాయకులు కొందరు తయారయినారు. అప్పటి కాలములో ధన బలమున్నవారు ధనము లేని పేదవారికి నాయకులుగా యుండి వారి మీద పెత్తనము చెలాయిస్తూ ఉండేవారు. ధనమున్న వారు ధనము లేనివానిని ఏదో ఒక రకముగా ఇబ్బందులపాలు చేసేవారు. అటువంటివాని చేతిలో డబ్బు లేనివారు మాత్రమే బాధపడేవారు. డబ్బు కొరకు వారు చెప్పినట్లు వినేవారు. ఇట్లు ఎందరో అమాయకులు కొంతమంది నాయకుల చేతిలో అనేక అగచాట్లు పడేవారు. ధనవంతుడు పేదవాని అవసర నిమిత్తము కొంత డబ్బులు ఇచ్చి వడ్డి అను పేరుతో వానిని దోమలు, నల్లుల మాదిరి పీడించేవారు. అట్లు నాయకుల చేతిలో అమాయకులు పీడింపబడేవారు.

సమాజములో ధనము కల్గిన నాయకుల చేతిలో ఎందరో పేద ప్రజలు పీడింపబడుచుండుగా, నాయకులుగా యున్నవారు కూడా నాయకుల కంటే పెద్దగా యున్న వినాయకుల చేతిలో పీడింపబడేవారు. నాయకుల వద్ద ధనమున్నా అధికారము ఉండేది కాదు. అదే వినాయకుల వద్ద అయితే ధనము మరియు అధికారము రెండూ ఉండేదానివలన వారు నాయకుల వద్దనున్న ధనమును కూడా లాగుచూ, తమ అధికారమును ఉపయోగించి ధనికులయిన నాయకులను కూడా బెదిరించుచూ తాము నాయకులకంటే ప్రత్యేకులము వినాయకులము అనేటట్లు ప్రవర్తించేవారు. నాయకుల ఆధీనములో కేవలము పేదవారు మాత్రమే ఉండగా, అధికార బలమున్న వినాయకుల చేతిలో పేదవారు, ధనికులు ఇద్దరూ ఉండడము విశేషము. పూర్వము ఊరికొక్క నాయకుడు ఉండగా, ఒక జిల్లాకంతా

కలిపి ఒక వినాయకుడు ఉండేవాడని అనుకుందాము. నేడు ప్రతి ఊరిలోను నాయకులు కొందరుండగా, వినాయకుడు ఒక్కడయినా ఉండడము జరుగుతా యున్నది.

సమాజములో ప్రజల యెడల జరుగు అక్రమాలను, నాయకుల వినాయకుల దుశ్చర్యలను గమనించుచున్న ఆధ్యాత్మిక వేత్తలు ప్రజలలోని సామాజిక వాదులను పిలిచి నాయకులు వినాయకులు చేయు దుశ్చర్యలను ప్రజలకు తెలిపి, ప్రజలను చైతన్యవంతులుగా చేయవలసినదిగా సూచనలను ఇచ్చారు. అటువంటి సూచనల వలన కొంతవరకు నాయకుల, వినాయకుల ఆగడాలను అరికట్టవచ్చునని తెలిపారు. ఆధ్యాత్మికవేత్తలు చెప్పినట్లు సామాజిక వాదులు చేయను మొదలు పెట్టారు. దానివలన అప్పటి కాలములో అనగా ద్వాపరయుగములో కొంతవరకు ప్రజలలో చైతన్యము వచ్చినది. నాయకుల, వినాయకుల దుశ్చర్యలు తగ్గినాయి. తర్వాత కాలము గడువగా నేడు కలియుగములో నాయకుల, వినాయకుల ఆగడాలు ప్రజలపై పెరిగిపోయినాయి. అయితే పూర్వము ఆధ్యాత్మికవేత్తలు సూచించిన కార్యములు నేడు సమాజములో మిగిలియున్నా, ప్రజలకు వాటి భావము తెలియకపోవడము వలన నాయకులకు, వినాయకులకు హద్దు, అదుపు లేకుండా పోయినది.

పూర్వము ఆధ్యాత్మికవేత్తలు సామాజికవాదులకు ఏమి సూచనలు ఇచ్చారు. వాటిని ఎలా అమలు చేశారు అన్న విషయము ఇప్పుడు మనము తెలుసుకోవలసియున్నది. ఇది ఎప్పుడో ద్వాపర యుగములోయున్న హావ భావముల విషయములను నేను ఇప్పుడు తెలియజేస్తున్నాను. అప్పటి విషయములు ఇప్పుడు నీకెట్లు తెలుసు అని అడగకుండా నేను చెప్పునది సత్యమో కాదో ఆలోచించి చూచుకోండి. అప్పటి రహస్యములను నేడు

నేను విప్పి చెప్పడము వలన కొందరికి అనగా నాయకులకు, వినాయకులకు నా మీద కోపము రావచ్చును. వారి కోపము వలన నన్ను కూడా ఇబ్బందులపాలు చేయుటకు మేము జ్ఞానులము అనుకొనే కొందరిని నాకు వ్యతిరేఖముగా పురికొల్పి నాపై దుష్ప్రచారము చేయవచ్చును. అయినా ఫరవాలేదు. నేను చెప్పునది శ్రద్ధగా వినండి.

సాధారణ మనిషికి రెండు చేతులు ఉంటాయి. సామాన్య మనుషులలో ధనబలమున్న వానిని ఆధ్యాత్మికవేత్తలు ప్రత్యేకముగా చూప దలచి, వారు సామాన్యునికంటే అధిక బలమున్నవాడు అని చూస్తూనే కనిపించునట్లు మనిషి ఆకారమునకు నాలుగు చేతులను పెట్టి చూపించారు. ఇంకా ధన బలము ఎక్కువ ఉన్నవానిని ఆరు చేతులుగా కూడా చూపించారు. మనిషికి రెండు చేతులు తప్ప నాలుగు చేతులు, ఆరు చేతులు ఎక్కడా ఉండవు. అయితే బలములో ఎక్కువ అన్నట్లు ఎక్కువ చేతులను మనిషి బొమ్మకు పెట్టి చూపడము జరిగినది. ఇదంతయు ద్వాపర యుగమున వ్యాసుడున్నప్పుడే వ్యాసుని సూచన మేరకే జరిగినదని కొంత ఆధారముతో చెప్పవచ్చును. ధన బలమున్నవారిని నాలుగు చేతులతో చూపడము ఆనాడు జరిగినది. నాలుగు చేతులు, ఆరు చేతులున్న మనిషి బొమ్మలను ఊరు ఎరిగింపుగా వీధులలో త్రిప్పి చూపెడివారు. అలా ఎక్కువ చేతులున్న వారు రెండు చేతులున్న సామాన్యులను తమ అదుపులో పెట్టుకొని రెండు చేతుల ప్రజల చేత వెట్టిచాకిరీ చేయించుకొనుచున్నారని తెలియునట్లు నాల్గు చేతుల బొమ్మలను ఊరంతా త్రిప్పి చూపెడివారు. అట్లు చూపునప్పుడు ఆ బొమ్మల ఎడల ఎవరికీ గౌరవభావము ఉండేది కాదు. ఇటువంటి దుర్మార్గులు తొందరగా పోవాలియని అనుకొనెడివారు. కొబ్బరికాయలు కొట్టడముగానీ, పూజలు చేయడముగానీ ఉండేది కాదు. అటువంటి బలాఢ్యులు, తమను పీడించు బలాఢ్యులు, తమ సొమ్మును వడ్డీరూపములో

దోచుకొనువారు ఇప్పటినుండి లేకుండా పోవాలియని మంగళహారతి ఇచ్చి శవము దగ్గర చెప్పినట్లు గోవిందా గోవింద అని చెప్పెడివారు. అట్లు ఆ కాలములో జరుగుచుండెడిది. అయితే కాలము మారుకొలదీ దాని అర్థము చెప్పువారు లేకుండా పోయి వైశ్య అను పదము వేశ్య అను పదముగా మారిపోయినట్లు, ఇందూ అను పదము హిందూ అను పదముగా మారిపోయినట్లు నాల్గు చేతుల, ఆరు చేతుల ధనిక దుర్మార్గులు ప్రజల పాలిట దేవతలై కూర్చున్నారు.

ద్వాపర యుగము నుండీ ఉన్న ఆచరణ నేటికీ ఉన్ననూ అప్పటి అర్థము లేకుండాపోయినది. అప్పుడు చెడువారిగా చూపబడే బొమ్మలను నేడు దేవతలవలె చూపుచున్నారు. బలవంతులైన ధనికులు ప్రజలను వేధించేవారు, బాధించేవారు అన్నట్లు గుర్తుగా వారికున్న నాలుగు చేతులకు నాలుగు హింసకు నెలవైన ఆయుధములను పెట్టి చూపించారు. వీరి వలననే మీరు హింసింపబడుతారు అన్నట్లు చేతులలో ఆయుధములను పెట్టి చూపినా ఈనాడు వారు దేవతలుగానే భావింపబడుతున్నారు. అలా మనుషులలో భావము మారిపోయినది. పూర్వము ఊరేగింపు సమయములలో నాల్గు చేతుల బొమ్మ ప్రక్కనే ఒక జ్ఞాని లేక ఆధ్యాత్మికవేత్త యుండి ఆ బొమ్మకు అర్థము చెప్పుచూ నీ పీడ ఇంతటితో విరగడ అయిపోవాలని మంగళహారతి ఇచ్చి శవానికి చెప్పినట్లు గోవిందా గోవింద అని గట్టిగా చెప్పుచూ, అందరిచేత చెప్పించెడివారు. అట్లు ఒక ఊరిలో ఊరేగింపు జరుగునప్పుడు ప్రతి ఇంటికి ప్రతి బజారుకు, ప్రతి వీధికి ఆ బొమ్మను తీసుకపోయి ధనవంతుల వద్ద చేరవద్దండి అని చెప్పుచూ మంగళ హారతి ఇచ్చి గోవింద చెప్పించెడివారు. ఆనాడు ప్రజలలో ఆ విధమైన భావమును జ్ఞానులు కలుగజేయగా, నేడు అటువంటి ఊరేగింపులేయున్నా, ఊరేగించే బొమ్మ ప్రక్కలో బ్రాహ్మణులు ఉంటూ, ఆ బొమ్మలను దేవతలవలె

చిత్రించి బొమ్మ ఎడల భక్తి భావమును కల్గించి ద్వాపరయుగము నాటి భావమును, అర్థమును ఏమాత్రము లేకుండా చేశారు.

అధిక చేతులు కల బొమ్మ పురుషునికే కాకుండా నేడు స్త్రీల బొమ్మలు కూడా తయారయినాయి. ద్వాపర యుగములో ఆధ్యాత్మికవేత్తలయిన జ్ఞానులు అర్థముతో కూడుకొన్న పని చేయగా, నేడు అజ్ఞానము పెరిగిపోయి ఏది మంచి పని, ఏది చెడు పనియని ఆలోచించక మంచి పనిని వదలివేసి చెడు పనినే మంచి పనిగా ఆచరించుచున్నారు. పూర్వము నేడు గల అధిక చేతులున్న బొమ్మలు లేవుగానీ, ఎక్కువ చేతులున్న మగ ప్రతిమ ఉండేది. దానిని భైరవుడు అని పిలిచేవారు. భైరవుడు అను పదములో కూడా విశేష అర్థము కలదు. రవుడు అనగా నాశనము చేయువాడు అని అర్థము. 'భై' అనగా దగ్గరగా యున్నవాడు లేక ప్రక్కనేయున్నవాడు అని అర్థము. దాని ప్రకారము నీ ప్రక్కనే ధనికుని రూపములో నిన్ను నాశనము చేయువాడు గలడు అని చెప్పడమైనది. ఒక లేనివానికి ఉన్నవాడు ధనము ఇచ్చాడు అంటే అప్పటి నుండి ఉన్నవాడు లేనివానిని పీడించను మొదలు పెట్టినట్లేయని చెప్పవచ్చును. అందువలన ధనమున్న వానిని ఎక్కువ బలవంతుడని తెలియునట్లు ఎక్కువ చేతులను ఉంచి చూపడమే కాక ఆ బొమ్మకు భైరవుడు అని పేరు పెట్టడము కూడా జరిగినది. ఈ విధానము ప్రకారము మీరు ధనమున్న వారిచేత మీ ధనమును పొగొట్టుకొన లేదా! మీరు సంపాదించినదంతా వడ్డీ రూపములో వారికి సమర్పించుకొంటూ రాలేదా! అయినా ఆ అప్పు తీరక వారి బాధ అయిపోకుండా యున్నవారు సమాజములో ఎంతోమంది యున్నారు. అమాయక బలహీనులను పీడించే ఎక్కువ చేతుల బలాఢ్యులులాగా మీకు కనిపిస్తున్నారు కదా!

సమాజములో ధనబలమున్నవారిని ఎలా పోల్చి చూపారో తెలిసింది కదా! అట్లే ధన బలము, అధికార బలమున్న వారిని కూడా ఇంకొక రకముగా

పోల్చి చూపడము జరిగినది. ధనబలమున్న వారిని భైరవునిగా చూపితే, అధికార బలమున్న వానిని ఇంకా ప్రత్యేకముగా చూపడము జరిగినది. అధికార బలము, ధనబలముకంటే పెద్దది. ఎంత ధనమున్నవానినయినా అధికారము చేత అణచి వేయవచ్చును. బంధించి జైళ్ళలో వేయవచ్చును. ధన బలముకంటే అధికారమునకే ఎక్కువ బలముండుట చేత నేడు ధనమున్న వారందరూ అధికారము కొరకు ప్రాకులాడుచున్నారు. అధికారమును ఎక్కువ బలమున్న ఏనుగుతో సమానముగా పోల్చారు. ఏనుగుకు నాలుగు కాళ్ళున్నా కాళ్ళతో నడక తప్ప ఏమీ చేయలేదు. అయితే ఏనుగుకు నాలుగు కాళ్ళుకాక ప్రత్యేకముగా తొండము ఉండుట వలన అన్ని పనులను తొండముతోనే చేయుచున్నది. నీళ్ళు త్రాగే దగ్గర నుండి ఆహారమును తీసుకొని నోటిలో పెట్టుకొనే వరకు మిగతా పనులన్ని ఏనుగు తొండముతోనే చేయగలదు. అందువలన ప్రత్యేకమయిన చేయిలాగా ఏనుగు తొండము గలదు.

మనిషికి ధనముకంటే అధికారము గొప్పది అన్నట్టు, ఏనుగుకు నాలుగు కాళ్ళకంటే తొండమే ఎక్కువ బలమైనదిగా యున్నది. అందువలన పూర్వము ఆధ్యాత్మికవేత్తలయిన వారు ధనబలమున్న వారిని నాల్గు చేతుల మనిషిగా చూపితే, అధికార బలమున్న వానిని నాలుగు చేతుల మనిషికి ఏనుగు తొండమును పెట్టి ఇది ప్రత్యేకమైన అధికార బలము అని చెప్పడమైనది. ఆ విధముగా తయారయినదే వినాయక బొమ్మ. వినాయక బొమ్మ ఆకారము ద్వాపర యుగముకంటే ముందు లేదు. ద్వాపర యుగములో వ్యాసుని సృష్ఠే వినాయకుడు. అందువలన బాల వినాయకుడు వ్యాసుని వద్ద విద్య నేర్చినట్లు చిత్రమును అక్కడక్కడ చూడవచ్చును. వినాయకున్ని సృష్ఠించిన వ్యాసుడు తన శివ పురాణములో పార్వతికి వినాయకుడు పుట్టినట్లు వ్రాశారు. అదియు భర్తయిన శివునికి తెలియ

కుండానే విఘ్నేశ్వరున్ని పార్వతి తయారు చేసిందను మాటను కూడా శివ పురాణములో విన్నాము. భర్తకు తెలియకుండా వినాయకుడు పార్వతికి ఎలా పుట్టాడని డైరెక్టర్ రామ్‌గోపాల్ వర్మ ప్రశ్నించుచున్నప్పటికీ వినాయక పురాణమును నమ్మిన మనము విచక్షణ లేనివారమై, చివరకు ప్రశ్నించిన రామ్‌గోపాల్ వర్మనే తిక్కవాడంటున్నాము. వాస్తవానికి రామ్‌గోపాల్ వర్మ అడిగినది సత్యమే. జవాబు లేని ప్రశ్నే. వాస్తవముగా వినాయకుడు పుట్టనూ లేదు, పార్వతి పుట్టించనూ లేదు. శివుడు తన కొడుకని ఒప్పుకోనూ లేదు.

ద్వాపర యుగములో తిరుగులేని రచయితగా యున్న వ్యాసుడు తన కలము చేత సృష్ఠించగా తయారయిన వాడే వినాయకుడు. వ్యాసుడు ఎందుకు అలా చేశాడు అనగా! ఆనాటి గ్రుడ్డి సమాజమునకు కన్ను తెరిపించి అధికార బలమున్న వాడు ఇట్లుంటాడు అని చూపించుటకే అలా చేశాడు. ఆ సమయములో పూర్తి ఆధ్యాత్మికమును తెలియనివాడైనప్పటికీ, తాత్విక చింతన మీద వ్యాసుడు ఆసక్తి కల్గియుండేవాడు. ఆనాడు సామాజిక న్యాయము కొరకు, సమాజ శ్రేయస్సు కొరకు ధనవంతునికి చిహ్నమైన భైరవున్ని, ధనబలమునకు అధికారబలమునకు చిహ్నముగా యున్న వినాయకున్ని వ్యాసుడే తయారు చేసి చూపించాడు. భైరవునికి నాలుగు చేతులు మాత్రముండగా, వినాయకునికి నాలుగు చేతులు ఆ చేతులకంటే బలమైన తొండము ఉండులాగున చేశాడు. దానివలన ధనవంతునికంటే అధికార బలమున్న వాడే గొప్పయని తెలియుచున్నది. ఈ రెండు రకముల బొమ్మలు సహజముగా పుట్టినవి కాకున్నా, ప్రత్యేక ఉద్దేశ్యముతో చేసినవని తెలియుచున్నది.

ద్వాపర యుగములో సామాజిక శ్రేయస్సు కోరిన వ్యాసుడు భైరవుని ఊరేగింపు సంవత్సరమునకు ఒకమారు చేయించేవాడు. అట్లే సంవత్సరము

నకు ఒకమారు వినాయక ఊరేగింపు చేయించేవాడు. అలా చేయిస్తూ అందులోని ఉద్దేశ్యమును ప్రజలకు తెలియుజేయు నిమిత్తము ఒక జ్ఞానిని ఊరేగింపులో పెట్టి, అతని చేత ఊరందరికీ తన ఉద్దేశ్యమును తెలియజేసెడి వాడు. ఆ విధముగా సామాజిక దుర్మార్గమును లేకుండా చేయవలెనని ప్రయత్నము చేశారు. అప్పుడు అది ఫలించింది. అందువలన ధనవంతులతో గానీ, అధికారము గల రాజకీయ నాయకులతోగానీ ప్రజలు అప్రమత్తముగా యుండి, వారి చేతిలో చిక్కక తప్పించుకొనెడివారు. ద్వాపర యుగము నుండి కలియుగమునకు కాలము మారినది. కాలముతో పాటు మనుషు లలో అజ్ఞానము పెరిగినది. ఆనాడు జ్ఞానులు తెలియజేసిన భావములు నేటి అజ్ఞాన ప్రపంచములో లేకుండా పోయినాయి. నేడు మేము జ్ఞానులము, మేము హిందూ ధర్మ రక్షకులము అనువారే వినాయక చవితిని దగ్గరుండి చేయుచూ వినాయకున్ని దేవుడని పూజించుచున్నారు. అప్పటికీ ఇప్పటికీ భావము మారిపోయినా నేను చెప్పినది సత్యము అనునట్లు కొన్ని ఆచరణలు నేటికీ మిగిలి ఉన్నాయి. నా వాదనకు నేటికీ బలము చేకూర్చునది వినాయక నిమజ్జన కార్యము.

ఆ రోజు ధనవంతుని చిహ్నామైన భైరవున్ని, ధన అధికార బలము నకు చిహ్నామైన వినాయకున్ని చూపించి, ఇటువంటి దుర్మార్గులను సమాజములో ఉండకూడదని తెలియజేయు నిమిత్తము ఊరేగింపు చేసి చివరిలో ఆ బొమ్మలను ముక్కలుగా పగులగొట్టి, నామరూపాలు తెలియ కుండా నీటిలో కలిపి నిమజ్జనము అని చెప్పెడివారు.

నిమజ్జనము అనగా లేకుండా చేయడమనేగా అర్థము. పూర్వము లాగా నేడు కూడా నాలుగు చేతులు, ఏనుగు తొండము పెట్టి ఊరేగించడము జరుగు చున్నది. అన్నీ పూర్వము జరిగినట్లే జరుగుచున్నవి. అయినా అప్పుడు వినాయక ఆకారమును ధన, అధికార బలముతో నిండి ప్రజలను

పీడించు దుష్టులుగా లెక్కించెడివారు. ఇప్పుడు అది పోయి వినాయకుడు దేవునిగా భావించారు. అప్పటికీ ఇప్పటికీ భావము మారినా, ఆచరణ మాత్రము మారకుండా పూర్వమువలె అన్నీ ఉన్నాయి. చివరిలో దుష్టుడు ఉండ కూడదను ఉద్దేశ్యముతో వినాయకున్ని పగులగొట్టి నీటిలో కలుపడము, నామ రూపములు లేకుండా చేయడము నేటికి ఉన్నది. అందరూ అదే పనిని చేయుచున్నారు. అచరణ అంతా నేను చెప్పిన దానికి సరిపోతూ యున్నది. అయితే మధ్యలో దేవుడు అని వచ్చిన భావము సరిపోలేదు. అందువలన నేను కొందరిని ప్రశ్నించి చూశాను. వినాయకుడు దేవుడని భావించి వారము లేక పది రోజులు అనేకముగా పూజ చేయుచున్నారు. దానిని కూడా మేము ఒప్పుకుంటాము. అంతగా డబ్బులు ఖర్చుపెట్టి ఎంతో గొప్పగా పూజలు చేసి, చివరిరోజు కొందరు మురికి నీళ్ళలో ముంచుచున్నారు. దేవుడని భావించిన తర్వాత ఆ విగ్రహమును అలాగే ఉంచుకొని, నిత్యము పూజలు చేయవచ్చును కదా! అంతేకాక అదే బొమ్మను తర్వాత వచ్చే సంవత్సరము కూడా పెట్టి పూజించవచ్చును కదా! అట్లు కాకుండా నీళ్ళు లేనిచోట మురికి నీళ్ళలో కూడా వేయడము జరుగుచున్నది. దేవుడని పూజించిన తర్వాత, వినాయకుని మీద భక్తి భావములున్న తర్వాత ఆ భక్తిని అట్లే పెంచుకోవడము బాగుంటుంది. కానీ అలా పారవేసి రావడము భక్తి భావమునకు ఏమాత్రము సరిపోదు. అలా ఎందుకు చేయు చున్నారని అడిగితే అలా చేయడము సాంప్రదాయము, సనాతన ధర్మము అంటున్నారు. అయితే ఆ సాంప్రదాయమును మన పెద్దలు ఎందుకు పెట్టారని ఏమాత్రము ఆలోచించడము లేదు. ఒకడు ఒక పనిని చేస్తే ఆ పనిని ఎందుకు చేశాడు, ఎందుకు చేయాలి? అను విచక్షణ కొద్దిగా అయినా లేకుండా గొర్రెదాటు మాదిరి ఆలోచన లేకుండా చేయడము మూర్ఖత్వము అని చెప్పవచ్చును.

నిమజ్జనము అను పదములో "జ" ఉంది కనుక జననము అనగా పుట్టుటయని అర్థము. మజ్జనము అనగా తిరిగి పుట్టడము అని అర్థము. **"ని"** అనగా లేకుండా చేయడము అని అర్థము కలదు. దాని ప్రకారము తిరిగి పుట్టకూడదు అను అర్థము వచ్చులాగున నిమజ్జనము అని అన్నారు. వినాయక నిమజ్జనము అనగా వినాయకుడు ప్రజలను పీడించే దుర్మార్గుడు కాబట్టి ఆయనను తిరిగి పుట్టకూడదను ఉద్దేశ్యముతో బొమ్మను పగులగొట్టి నీటిలో వేయుచున్నాము. పూర్వములాగా చివరిరోజు నిమజ్జనము ఉంది. ద్వాపరయుగములో మన పెద్దలయిన వ్యాసుడు మొదలగువారు ఏర్పాటు చేసిన ఆచరణ అంతయు యున్నది. అయినా ఆనాటి భావము లేకుండా పోయినది. ఈ రోజు మేము వినాయక పండుగను గురించి ఉన్న వాస్తవమును చెప్పితే గ్రహించుకోలేని కొందరు మమ్ములను నానా రకములుగా దూషించడమే కాక పరమతమువాని క్రిందికి లెక్కేసి చెప్పు చున్నారు. నేను చెప్పు సత్యమును మీరు గ్రహించుకోలేక నన్ను దూషించే దానికంటే ఆ ఆచరణలు ఎందుకున్నాయని కొంతయినా ఆలోచించవచ్చును కదా! విచక్షణ లేకుండా ఒకడు నన్ను దూషిస్తే మిగతా వారు కొంతయినా ఆలోచించకపోవడము, మేము కూడా దూషిస్తామని దూషించడము చూస్తే మిమ్ములను చూసి నవ్వాలో, ఏడ్వాలో నాకే అర్థము కాలేదు. నేను హిందూమతములో పుట్టినందుకు, హిందూ మతములో విచక్షణ లేకుండా, గ్రుడ్డిగా అర్థము తెలియకుండా ప్రవర్తించు వారిని చూచి వీరా హిందువులు అనిపిస్తావుంది. అందరూ అధర్మము భావములను కలిగియుండి, గ్రుడ్డిగా ప్రవర్తించుచున్నందుకు హిందూ సమాజము బాగుపడుతుందా అని అనుమానము వస్తావుంది. ఈ ఒక్క విషయములోనే కాకుండా భక్తి అను అన్ని మార్గములలో మూర్ఖముగా ప్రవర్తించుచున్నారు.

హిందువులకు ఆధ్యాత్మిక విద్యలో ప్రమాణ గ్రంథము బ్రహ్మావిద్యా శాస్త్రమయిన భగవద్గీత. భగవద్గీతలో మొదటినుండి చివరి వరకు చూచినా వినాయక పండుగను గురించిగానీ, భైరవుని ఊరేగింపును గురించి గానీ చెప్పారా లేదు. అటువంటప్పుడు మన గ్రంథమును మనము చదివి, అందులో జ్ఞానమును తెలుసుకోకుండా ఇటువంటి పండుగ వెంటపడి కాలమును, డబ్బును వృథా చేసుకోకూడదని హితము చెప్పుచున్నాము. ఇటువంటి **అర్థములేని, అర్థము తెలియని ఆచరణలను వేయి చేయుటకంటే భగవద్గీతలో దేవుడు చెప్పిన ఒక్క జ్ఞాన సూత్రమును ఆచరించుట మేలు.** హిందువులు పరమతముల ముందర అజ్ఞానులుగా కాకుండా జ్ఞానులుగా నిలువవలెనను కోరికతో మరియు పూర్వము మనకు, మన దేశమునకు ఉన్న 'జ్ఞానుల దేశము' అను పేరును స్థిరస్థాయిగా ఉండునట్లు చేయమని కోరుచున్నాను.

**ప్రశ్న :- మీరు ఎన్ని చెప్పినా మేము వినముగాక వినము. ఎందుకంటే మీరు స్వచ్ఛమయిన హిందువు కాదు. పరమత భావములు మీలో చాలా ఉన్నాయి. అందువలన అందరూ దేవుడనుచున్న రామున్ని దేవుడు కాదని అన్నారు, కిరాయి హంతకుడు అని అన్నారు. అంతటితో ఆగక అసుర రాజయిన రావణాసురున్ని భగవంతుని అవతారమన్నారు. రామునికి వ్యతిరేఖమయిన రావణుడు నీకు దేవుడయితే మేము ఎలా ఒప్పుకుంటాము? రామున్ని దేవుడు కాదను మీరు హిందువులే కాదని చెప్పుచున్నాము అని కొందరంటున్నారు. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను చెప్పినదంతా మీరు వినవలెనని నేను చెప్పలేదు. అర్థమయిన వాళ్ళు వింటారు, అర్థము కానివాళ్ళు వినరని నాకు తెలుసు. మతము అనునది అజ్ఞానముతో కూడుకొన్నదని, మతము అనే మాయలో పడవద్దు అని చెప్పుచున్న మేము పరమత ముసుగులో ఉన్నామనుట అర్థము లేనిమాట. భగవద్గీతలోగానీ, బైబిలులోగానీ, ఖుర్ఆన్‌లోగానీ మతము అను పేరే లేదు. మూడు దైవ గ్రంథములు ఒకే జ్ఞానమును బోధించుచున్నవి. మూడు గ్రంథములలోను **"సమస్త ప్రజలకు"** అని చెప్పి హితబోధ చేశారు గానీ ఇది ఫలానా మతము వారికి అని చెప్పలేదు. భగవద్గీతలో ఎక్కడయినా ఈ జ్ఞానము హిందువులకు అని చెప్పారా? అట్లే ఇంతకుముందు ఖుర్ఆన్ 5వ సూరాలోని (4) వాక్యములను చెప్పాను. ఆ వాక్యముల వలన మూడు గ్రంథములలో ఒకే జ్ఞానమున్నదని తెలియు చున్నది తప్ప, అక్కడేమయినా ఇతర మతములను దూషించినట్లుయున్నదా? మిగతా రెండు దైవ గ్రంథములు భగవద్గీతనే ధృవీకరించుచున్నవని చెప్పాయి కదా! మిగతా రెండు మత గ్రంథములు చదివినప్పటికీ భగవద్గీత చదువక పోతే అతడు ఏ ధర్మములో లేనట్లేయని చెప్పలేదా? ఈ విషయములను ఏమాత్రము తెలియకుండా మాలో పరమత భావములున్నాయని చెప్పడము తప్పుకాదా! నేను ఏ ఒక్క మతమునూ సమర్థించలేదు, అన్ని మతముల గ్రంథములలో ఒకే జ్ఞానము ఉందని చెప్పుచున్నాము. భగవద్గీత, బైబిలు, ఖుర్ఆన్ మూడు గ్రంథములు చదువకపోతే మీరు ఏ ధర్మములోను లేనట్లేయని 5వ సూరా, 68వ ఆయత్‌లో చెప్పలేదా, ఖుర్ఆన్‌లో ఇంతమంచి వాక్యముందని తెలియక అది ముస్లీమ్ గ్రంథమని చెప్పడము తప్పుకాదా! భగవద్గీతగానీ, బైబిలుగానీ, ఖుర్ఆన్ గానీ ఏదీ ఏ మత గ్రంథము కాదు. ఆయా మతములు ఇవి మా గ్రంథము అని చెప్పుకొంటున్నాయి. మతములలోని మనుషులు దైవ గ్రంథములకు మతములను అంటగట్టి,

వాటిని మత గ్రంథములని అంటున్నారు. అంతేగానీ అవి దైవ గ్రంథములే తప్ప మత గ్రంథములు కావు.

నేను రామున్ని దేవుడు కాదన్నానని అంటున్నారు. అలా చెప్ప వలసిన సందర్భము రాలేదు. నేను రాముడు దేవుడా! కాదా! అను విషయమును ఎక్కడా చెప్పలేదు. ఒక సందర్భములో **"ద్రావిడ బ్రాహ్మణ"** అను గ్రంథములో రాముడు వాలిని చంపి కిరాయి హంతకుడని పేరు తెచ్చుకొన్నాడు అని చెప్పాము. అక్కడ విషయమును పరిశీలించి చూస్తే రాముడు వాలిని హత్య చేస్తే సీతను వెతకడములో తనకు సహాయము చేయాలని ముందే ఒప్పందము చేసుకొన్నాడా లేదా మీరే చెప్పండి. అలా మాట్లాడుకొని తర్వాత హత్య చేయడమును కిరాయి హత్య అనకుండా ఏమనాలి? మీరే చెప్పండి. అది ముమ్మాటికీ కిరాయి హత్యే కాబట్టి మేము ఒక గురువుగా సత్యము చెప్పాలా, అసత్యమును చెప్పాలా? అని అడుగుచున్నాను. ఆయనలో జ్ఞానము ఎంత ఉందో చూచి, దానివలన ఆయన దేవుడో కాదో చెప్పవచ్చును. అయితే భూమిమీదికి వచ్చిన దేవున్ని గుర్తించుట చాలా కష్టముయని **"గురువు"** అను గ్రంథములో వ్రాశాము. రాముడు దేవుడా! కాదా! అని చూడవలసిన అవసరము ఏర్పడలేదు. కాబట్టి దేవుడు అవునా కాదా!యను విషయమును నేను చెప్పలేదు.

త్రేతాయుగములో రావణబ్రహ్మ ఎవరు? అను విషయము ఎవరికీ తెలియదు. ద్వాపరయుగములో కృష్ణుడు భగవద్గీత చెప్పిన తర్వాత, అందులో జ్ఞానము తెలిసిన తర్వాత రావణబ్రహ్మ మీద ఒక అంచనా వచ్చి ఆయనను భగవంతుని జన్మగా చెప్పవలసి వచ్చినది. భగవద్గీతలోని ధర్మముల ప్రకారము రాముని జీవితముంటే ఆయనను కూడా దేవుడు అని చెప్పక తప్పదు. అయితే అటువంటి పోలికలు రాముని జీవితములో లేవు.

రావణుని జీవితములో కనిపించాయి, కాబట్టి రావణ బ్రహ్మను భగవంతుని అవతారము అనవలసి వచ్చినది. ఏదయినా ఒక నిర్ణయము చేసి చెప్పుటకు దానికి తగిన ప్రమాణములు అవసరము. శాస్త్రప్రమాణము లేకుండా దేనినీ నిర్ధారణ చేసి చెప్పలేము. **భగవద్గీతలో దేవుడు మూడు ధర్మములను గురించి, నాలుగు అధర్మముల గురించి చెప్పడము జరిగినది.** దేవుడు మనిషిగా భగవంతుని అవతారముతో ఎప్పుడు వచ్చినా నాలుగు అధర్మము లను లేకుండా చేయాలని చూస్తాడు, అట్లే మూడు ధర్మములను నెలకొల్పాలని చూస్తాడు. అటువంటి ఆచరణ భగవంతునిలో ఉండునని కృష్ణుని అవతారము తర్వాత తెలిసింది.

మనుషులు ఎన్నో జన్మలు ఎత్తుచున్నప్పటికీ వాడు కర్మబద్ధుడై యుండి, కర్మప్రకారము ఆడించబడుచుండును. కర్మ అనునది మనిషి జీవితమునకు కారణము కాగా, కర్మప్రకారము ఆడించువాడు మనిషి శరీరములోని ఆత్మేనని తెలియవలెను. **మనిషి దైవజ్ఞానము తెలియగలిగి జ్ఞాని అయితే ధర్మములను ఆచరించాలని ప్రయత్నము చేయును తప్ప అధర్మములను లేకుండా చేయవలెనని ప్రయత్నము చేయడు. అదే మనిషికీ దేవుని అవతారమైన భగవంతునికీ ఉన్న తేడాయని చెప్పవచ్చును.** భగవంతుడు తాను ధర్మములను ఆచరించాలని చూడడుగానీ, అధర్మములను లేకుండా చేయవలెనని చూస్తాడు. కావున ఈ ఒక్క కార్యమును ఆధారము చేసుకొని మనుషులలో భగవంతుడు ఎవడు అని కనుగొనవచ్చును. ఈ ఒక్క ఆధారము తప్ప ఇతరము ఏదీ లేదు. అయినా భగవంతుడు భూమిమీదికి వస్తే ఆయనను గుర్తించుట చాలా కష్టము. ఎందుకనగా! వారు అధర్మములను లేకుండా చేయుచున్నారని కూడా బయటికి తెలియ కుండా ప్రవర్తించుచుందురు.

నాకు తెలిసి రావణబ్రహ్మాది మొదటి భగవంతుని జన్మ అని అనుకొంటున్నాను. అందువలన ఇతరులు తనను భగవంతుడని గుర్తిస్తారేమోనని ఆయన అనుకోలేదు. అందువలన అధర్మములను బాహాటముగా ఖండించాడు. రెండు అధర్మములను అణచివేయడములో పూర్తి బయటపడిపోయాడు. ఎప్పుడయితే వేదపఠన శబ్దములను లేకుండా చేయుటకు, యజ్ఞములను భంగము చేయుటకు, లంక నుండి భారత దేశమునకు వచ్చి వేదపఠనము చేయువారిని, యజ్ఞములను చేయువారిని గుర్తించి వారిని భయపెట్టడము, జరిగే యజ్ఞములను ధ్వంసము చేశాడో అప్పుడు ఈయన భగవంతుడని నేడు తెలియగలిగాము. రావణబ్రహ్మ యున్న రోజులలో బ్రహ్మవిద్యా శాస్త్రము గ్రంథరూపములో బయటికి రాలేదు. అందువలన ఏవి ధర్మములో, ఏవి అధర్మములో ఎవరికీ తెలియదు. అందువలన వీటిని అనుసరించి భగవంతుని తెలియలేకపోయారు. నేడు ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీత ద్వారా మూడు ధర్మములు, నాలుగు అధర్మములను తెలియగలిగాము. అందువలన నేను కలియుగములో, త్రైతాయుగమున పుట్టిన రావణబ్రహ్మను భగవంతుడని అంటున్నాము.

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

అను సూత్రము ప్రకారము అందరూ రాముడు దేవుడంటే, దేవుడని నేనూ అనడమూ, అట్లే ఇంకొకరిని దేవుడు కాదు అంటే నేను కూడా కాదు అనడమూ చేస్తే అది గొర్రెదాటు అవుతుంది. ఏదానికయినా విచక్షణ అవసరము, శాస్త్రప్రమాణము అవసరము. శాస్త్రప్రమాణము లేనిది అందరూ చెప్పుచున్నారని చెప్పకూడదు. అందువలన మీ మాటలను బట్టి రాముడు దేవుడా! కాదా!యని చూడవలసియున్నా దానివలన నాకు

ఎటువంటి ప్రయోజనము లేదు. రాముని జీవితము తెరచిన పుస్తకము లాంటిది. ఆయన ప్రపంచములో ఎలా జీవించాడో ఆయన జీవితము రామాయణ గ్రంథము ద్వారా తెలియుచున్నది. ఆయన ధర్మము ప్రకారము నడచుకోవాలని ప్రయత్నము చేశాడుగానీ, అధర్మములను లేకుండా చేయాలని అనుకోలేదు. అలా అనుకొనుటకు ఆయన జీవితములో అవకాశమే లేకుండా ఎక్కువ కాలము కష్టాలేయనుభవించాడు. అయినా ఆయనను గురించి ఇప్పుడు చర్చించవలసిన అవసరము లేదు. రాముడు తాను కష్టపడ్డాడుగానీ ఇతరులను కష్టపెట్టాలని ఎప్పుడూ అనుకోలేదు. ఆయన ప్రపంచ లాభము కొరకు వాలిని చంపినా, తాను తప్పు చేశానని అనుకొనెడి వాడు. అదే ఆయనలో ఉండే గొప్పతనము. వాస్తవముగా రామునికి ఆనాడు ధర్మాలు తెలియవు, అధర్మాలు తెలియవని చెప్పవచ్చును. అందువలన ఆయన దేవుడా! కాదా!యని చూడవలసిన అవసరము లేదు. అయినా ఆయన పుట్టిన జాతక బలమునుబట్టి భారతదేశములో రాముడు దేవుడని చాలామంది అంటున్నారు. నేను ఇంతవరకు ఏదీ చెప్పలేదు. రామున్ని దేవుడంటే వారు హిందువులని, రాముడు దేవుడు కాదంటే వారిని హిందువులు కాదని మీరు చెప్పుచున్నారు. ఆ లెక్కప్రకారము నన్ను కూడా మీరు హిందువు కాదంటున్నారు.

ఇప్పుడే హిందూమతము క్షీణించి నేడు మిగతా రెండు మతముల ముందర చాలా తక్కువ సంఖ్యగా ఉన్నది. అటువంటి సమయములో మీరు రాముడు దేవుడు కాదు అనేవారంతా హిందువులు కాదు అంటే నేడు ఉన్న హిందువులలో నాలుగవవంతు సంఖ్యను కోల్పోవలసి యుంటుంది. అలాంటప్పుడు హిందూమతమును క్షీణింపజేసినవారమవు తాము తప్ప అభివృద్ధి చేసినవారము కాదు. నేడు గల హిందూరక్షణ సంస్థలన్నీ పూర్వము నుండి తమకు సరిపడని వాళ్ళను హిందువులు

కాదు అని చెప్పడము వలన హిందూమతము క్షీణించుచూ వస్తున్నది. నేడు నన్ను హిందువు కాదు అంటే నేను, నన్ను నా జ్ఞానమును అనుసరించు మూడు లక్షల మంది హిందువులను ఒక్కమారు కోల్పోవలసి వచ్చును. ఇతర మతముల నుండి ఒక్క హిందువును తయారుచేయలేని మీరు, హిందూమతమును రక్షిస్తామని చెప్పుచూ చివరకు మీరే హిందూమతమును నాశనము చేయుచున్నారని చెప్పక తప్పదు.

మీరు నన్ను హిందువు అనినా హిందువునే, హిందువు కాదు అనినా హిందువునే. ఎవడయితే దేవుని జ్ఞానము తెలియునో వాడు ఇందువే అగును. ఇతర మతములలో కూడా జ్ఞానులున్నారు. కావున వారు కూడా ఇందువులే అవుతారు. ఆ లెక్కప్రకారము ఇందూ సంఖ్య అన్నిటి కంటే ఎక్కువగా యున్నదని చెప్పవచ్చును. మీ లెక్క ప్రకారమైతే హిందువులు ఇతర మతముల ముందర చాలా తక్కువ సంఖ్యలో యున్నారని చెప్పవచ్చును. ఇప్పుడు చెప్పండి నన్ను హిందువుగా ఒప్పుకొని హిందు మత సంఖ్యను పెంచుతారో, ఒప్పుకోకుండా పోయి హిందూ మత సంఖ్యను క్షీణింప చేస్తావో నీవే ఆలోచించుకో. జ్ఞానము అంతరంగములో ఉంటుందిగానీ బయటికి కనిపించునది కాదు. అందువలన ఎవరు జ్ఞానియో ఎవరు అజ్ఞానియో గుర్తించుట కష్టము. మూడు మతములకు గురువుగాయున్న నన్ను హిందువు అన్నా అనకున్నా నాకు ఏమీ ఫరవాలేదు.

**ప్రశ్న :- సీతను అపహరించుక పోయిన రావణుడు నీకు మంచి వాడు ఎట్లయినాడు. భగవంతుని అవతారములో అలా చేయుట తగునా?**

**జవాబు :-** సీతను అపహరించుకపోయాడని మీరెందుకు అనుకోవాలి?

సీత రావణబ్రహ్మకు పుట్టిన శిశువుగా యున్నప్పుడే దొరికింది. సీతకు రావణబ్రహ్మ సాకుడు తండ్రిగా యున్నాడు. తన కూతురు ఆచూకి తెలిసిన తర్వాత వచ్చి సీతను పిలుచుకుపోయాడు. రావణుడు తన తండ్రియని సీతకు తెలుసు. సీతకు ఐదు సంవత్సరముల వయస్సులో జనక మహా రాజు రావణుని దగ్గరనుండి దత్తపుత్రికగా స్వీకరించి, పోషించి పెద్దయిన తర్వాత రామునితో పెళ్ళి చేశాడు. రావణుడు చిన్నప్పుడు తండ్రికాగా, జనకుడు పెంచిన తండ్రిగా యున్నాడు. రావణబ్రహ్మకు దొరికిన బిడ్డయని 'జైన రామాయణము'లో వ్రాసిపెట్టారు చూడండి.

## ప్రశ్న :- రావణ బ్రహ్మ సీతను పెళ్ళాడాలను ఉద్దేశ్యముతో సీత స్వయంవరమునకు పోయాడు కదా! దీనికేమంటారు?

**జవాబు :-** మీ బుర్ర చెడిపోయింది అని అంటాను. రావణబ్రహ్మకు సీత స్వయంవరమును గురించి లంకకు సమాచారమే పంపలేదు. సమాచారమే తెలియనిది ఎలా పోతాడు? ఒకవేళ పోయినా బిడ్డ పెళ్ళికి పోతాడుగానీ, సీతను పెళ్ళి చేసుకోవడానికి అని చెప్పడము తప్పుకాదా! రావణబ్రహ్మ త్రికాల జ్ఞాని అని పేరుగాంచిన వ్యక్తిని చిల్లరగా మాట్లాడడము మంచిది కాదు.

## ప్రశ్న :- సీత అడవిలో యున్నప్పుడు మారీచుని బంగారు జింక వలె పంపి రామున్ని జింక వెంట దూరముగా పోవునట్లు చేసి సీతను అపహరించినది వాస్తవము కాదా?

**జవాబు :-** భూమిమీద బంగారు జింకలు లేవు. సీతను రావణబ్రహ్మ అపహరించాడు అనడమే తప్పు. ఆయన భగవంతుని అవతారము అని తెలియక అట్లు మాట్లాడుచున్నారు.

**ప్రశ్న :- భూమిమీద జ్ఞానులు ఉండవచ్చును, ఆత్మజ్ఞానులు ఉండవచ్చును. రావణబ్రహ్మను 'త్రికాల జ్ఞాని' అని అంటున్నారు. త్రికాల జ్ఞాని అంటే అర్థము ఏమి గలదు?**

**జవాబు :-** 'కాల' అనగా 'నల్లని' 'తెలియని' అని అర్థము గలదు. 'త్రి' అనగా 'మూడు' అని అర్థము. మనలో యున్న మూడు ఆత్మలను త్రికాల అని చెప్పాడు. త్రికాల అను పదమును ఖుర్ఆన్‌లో "తౌరాత్" అని చెప్పారు. మూడు ఆత్మలను తెలిసినవాడు రావణబ్రహ్మ అయినందున ఆయనను త్రికాల జ్ఞాని అని పిలువడమైనది. రావణబ్రహ్మ సాధారణమైన మనిషి కాదని, అతను భగవంతుడేయని చెప్పుటకు ఆధారములున్నా, వాటిని గుర్తించక అనవసరముగా చెడు కార్యములను సృష్ఠించి ఆయన మీద వేయడము మంచిదికాదు. రావణబ్రహ్మ యొక్క పూర్తి సమాచారము కావాలంటే మేము వ్రాసిన **"రావణబ్రహ్మ"** గ్రంథము చదవండి. అట్లే **"ద్రావిడ బ్రాహ్మణ"** అను గ్రంథము కూడా చదవండి.

**ప్రశ్న :- రావణబ్రహ్మ దేవుని అవతారమైన భగవంతుడైతే రాముని చేతిలో ఎందుకు చనిపోయాడు?**

**జవాబు :-** చావుపుట్టుకలు, బ్రతుకుతెరువులు సాధారణ మనిషికి ఉన్నట్లే భగవంతునికి కూడా ఉండడము సహజమే. భగవంతుడు ఇట్లే బ్రతుకుతాడు యనిగానీ, ఇట్లే చనిపోతాడనిగానీ ఏమీ నిర్ధారణ ఉండదు. ఆయన చనిపోయిన దానినిబట్టి గానీ, ఆయన బ్రతికిన దానినిబట్టిగానీ ఈయన భగవంతుడు అని చెప్పుటకు వీలులేదు. అందువలన భగవంతుని విషయములో అటువంటి విషయములను చూడకూడదు. చూడవలసినది ధర్మములను, అధర్మములను మాత్రమే. ధర్మాధర్మములను బట్టి మాత్రమే

భగవంతున్ని గుర్తించవచ్చును. భగవంతుడు ధర్మములను ఆచరించవచ్చు, ఆచరించకపోవచ్చు. అయితే ఆయన అధర్మములను మాత్రము లేకుండా చేయవలెనని చూస్తుంటాడు. అదే భగవంతుని గుర్తు.

**ప్రశ్న :- రావణబ్రహ్మ మొదట జన్మించిన భగవంతుడు అని మీరు అప్పుడప్పుడు అనగా విన్నాము. ఆయన వచ్చిపోయాడు ఆయన భూమి మీద ఏ ధర్మములను ప్రతిష్ఠించాడు? ధర్మ సంస్థాపన కొరకే దేవుడు భగవంతునిగా పుట్టును అని చెప్పు చున్నారు కదా! ఆయన భగవంతుడని మీరు ఒక్కరే చెప్పు చున్నారు. మీరు చెప్పకపోతే ఆయన భగవంతుడని ఊహ కూడా ఎవరికీ రాదు. ఆయన భగవంతుడుగా తెలియకున్నా ఆయనకు గుర్తింపుగా భూమిమీద ఏదయినా మిగిలియున్నదా?**

**జవాబు :-** దేవుడు భగవంతునిగా భూమిమీదకు వచ్చిపోతే క్రొత్త ధర్మములను ఏమీ చెప్పడుగానీ, ఉన్న ధర్మములను తిరిగి జ్ఞాపకము చేయును. అట్లు జ్ఞాపకము చేయడమే ధర్మప్రతిష్టాపన చేసినట్లుగును. దేవుడు భగవంతునిగా శరీరము ధరించి వస్తే ఆయన అప్పటికయినా లేక ఎప్పటికయినా గుర్తించబడవచ్చు లేక గుర్తింపబడలేకపోవచ్చు. గుర్తింపుకు ఆయన జన్మకు ఏమాత్రము సంబంధము లేదు. భగవద్గీత ప్రకారము ఆయన అనేకమార్లు వచ్చిపోయాడని జ్ఞానయోగములో ఐదవ శ్లోకము ప్రకారము తెలియుచున్నది. అయితే మనకు ఆ జన్మలన్నీ ఎక్కడా గుర్తింపుపడలేదు. మనకు ఇప్పటికి తెలిసినవి కేవలము మూడు జన్మలు మాత్రమే. ఆ మూడు జన్మలను కూడా నేను మాత్రమే చెప్పుచున్నాను. నేను చెప్పిన జన్మలను మిగతా మతములవారు ఎవ్వరూ ఒప్పుకోవడము లేదు. హిందూమతములో

కూడా అందరూ ఒప్పుకోవడము లేదు. భూమిమీద తన అవసరము వచ్చినప్పుడు దేవుడు భగవంతునిగా వస్తాడు, పోతాడు. ఆయన వచ్చి పోయినట్లు ఎవరూ గుర్తించుటకు అవకాశము లేకుండా చేస్తాడు. తన జన్మను గురించి తెలియనవసరము లేదుగానీ, తన జ్ఞానమును గుర్తింపుగా తెలియవలెనని అనుకొంటాడు. ప్రస్తుత కాలములో భగవంతుడు భూమిమీద ఉన్నాడని నేను నమ్ముచున్నాను మీరు నమ్మగలరా?

**ప్రశ్న :- భారత్ టుడే ఛానల్‌లో ప్రత్యేకించి "ప్రబోధ ఉన్మాదమ్" "ధర్మ పీఠమ్" అను పేరుతో ఒక చర్చ జరిగింది. అది దాదాపు ఒక గంటసేపు జరిగిన చర్చలో మిమ్ములను అన్ని రకములా విమర్శించడము జరిగినది. అందులో పాల్గొన్న జ్యోతిష్య శాస్త్రజ్ఞుడు తేజశ్వీశర్మగారు, ఆధ్యాత్మిక పరిశోధకులు భాస్కర్ రాజుగారు మిమ్ములను ప్రతి విషయములోను విమర్శించడము జరిగినది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** వారు మాట్లాడిన ప్రతి మాట విన్నాను. వాళ్ళు నాకంటే ఎంతో వెనుక పుట్టినవారు. నేను దాదాపు 45 సంవత్సరముల నుండి జ్ఞానమును బోధిస్తున్నాను. నాకున్న అనుభవమంత కూడా వారి వయస్సు లేదు. జ్యోతిష్య శాస్త్రజ్ఞునకు మొత్తము గ్రహములెన్నో తెలియదు. పూర్వము నుండి అందరూ పాడిన పాటే పాడుచూ గ్రహములు తొమ్మిదేయని చెప్పుచున్నాడు. నేను జ్యోతిష్య శాస్త్రమునకు సంబంధించి **"జ్యోతిష్యము శాస్త్రమా?, అశాస్త్రమా?"** అను గ్రంథమును వ్రాశాము. అందులో 12 గ్రహములున్నాయని తెలిపాము. శర్మగారికి తొమ్మిది మాత్రమే తెలుసు. ఆయన కూడా నన్ను విమర్శించేవాడే. ఇకపోతే ఆధ్యాత్మిక పరిశోధకుడు

భాస్కర్‌రాజు ఇంకా పరిశోధనలోనే యున్నాడు. ఆయన జీవాత్మ, పరమాత్మను గురించే మాట్లాడగలడు గానీ ఆత్మంటే ఏమిటో తెలియదు. నేను ఆధ్యాత్మికములో నాల్గవ సిద్ధాంతకర్తనని కూడా తెలియదు. నోరుంది కదా! ఏదో ఒకటి మాట్లాడడము వారికి తెలుసు. ఆధ్యాత్మిక విద్యలో నేను వందకు పైగా గ్రంథములు వ్రాశానని, నా గ్రంథములు ఎంతోమంది ప్రముఖుల చేత ప్రశంసింపబడుచున్నవని తెలియదు.

వీరి మాటలలో అసూయ తప్ప నాకు ఏమీ కనిపించలేదు. నేడు సమాజములో చాలా కాలమునుండి నేను చూస్తున్నాను. ఎక్కడ గురువులుగా, స్వాములుగా, బోధకులుగా యున్నా ఒక్క బ్రాహ్మణులే ఉండాలని మిగతావారు ఉండకూడదను అసూయ వారిలో నాకు కనిపించు చునే యున్నది. నేను స్థాపించిన 'ద్రావిడ బ్రాహ్మణ సంఘము'లో ఎందరో బ్రాహ్మణులున్నారు. వారందరూ నా బోధలు చదివి నన్ను ఎంతగానో ప్రశంసించుచున్నారు. అయినా కొద్దిపాటి మందికి నా విలువ, నా జ్ఞానము తెలియదు. కాబట్టి వారు మేము తప్ప ఇతర కులముల వారు గురువులుగా చలామణి కాకూడదు అన్న అసూయను వెళ్ళగ్రక్కుచున్నారు. ప్రస్తుత కాలములో బ్రాహ్మణేతరులు బోధకులుగా ఎక్కడయినా ఉన్నా వారు పేరుకు రాలేదు గానీ, నేడు బాగా ప్రచారమయిన వారు విశాఖలో రమణానంద మహర్షిగారు, ప్రబోధానంద యోగీశ్వరులు. ఎక్కడ చూచినా ఈ రెండు పేర్ల మీదనే నేడు గల స్వాములందరూ అసూయతో మాట్లాడుచుందురు. రమణానంద మహర్షిగారు షిరిడి సాయిబాబా గారి భక్తుడు, ఆయన బాబా గారిని గురించే మాట్లాడుచుంటాడు. ఆయన వాల్మీకి కులమునకు చెందిన వాడు. నేను చౌదరీ కులమునకు చెందినవాడిని. అయినా నేను యోగిగా యుంటూ ఏ దేవున్ని ఆరాధించకుండా ఆత్మ, పరమాత్మలను గురించే చెప్పుచున్నాను. మొత్తము మీద బ్రాహ్మణ కులమువారే స్వాములుగా,

బోధకులుగా, గురువులుగా ఉండాలి. ఇతర కులముల వారుండకూడదు అనే ఉద్దేశ్యము చర్చావేదికలలో పాల్గొనే వారియందు బాగా కనిపించు చున్నది.

పూర్వము నుండి ఇతర కులముల వారిని ఎదగకుండా అణచి వేయడము జరుగుచూనే యున్నది. సర్వసాధారణముగా ఇతర కులముల వారు అరుదుగా భక్తి భావములో యున్నా, ఇతరులకు బోధించు స్థోమత చాలా తక్కువయుండును. అందువలన బోధకులయిన స్వాములుగా, గురువులుగా చలామణి అయినవారు అరుదుగా ఎక్కడయినా ఉన్నా, వారిని సమాజములో స్వాములుగా పాతుకొని పోయిన ఒకే కులమువారు (బ్రాహ్మణులు) అనగద్రొక్కి పైకి ఎదగకుండా చేశారు. గతములో గొప్ప ఆధ్యాత్మికవేత్తయిన వేమనయోగి గారిని అలాగే చేసి, ఆయనను వెర్రివాని క్రిందికి జమకట్టి మాట్లాడినారు. నేను వేమన యోగి పద్యమును వివరించి చెప్పితే ఈ చర్చలో వేమనను అసూయతో మాట్లాడుచూ 'ఆయన చెప్పినది భగవద్గీతనా! దానిని గురించి చెప్పుకొనే దానికి' అని మాట్లాడారు. వాస్తవముగా వేమనయోగి చెప్పిన చిన్న పద్యములో ఒక పెద్ద గ్రంథములో చెప్పిన సారాంశముండును. ఈ మధ్య కాలములో నేను చెప్పిన మీటింగ్‌లో "జలం" అను అంశమును మాట్లాడుచూ వేమన పద్యమును వివరించి గంటసేపు చెప్పాను. మూడు ముక్కల చిన్న పద్యమును వివరించే దానికి గంటకాలము పట్టిందంటే కొన్ని పద్యములు ఒక్కొక్కటి ఒక గ్రంథము కాగలదు. అంతగొప్పగా ఆధ్యాత్మికమును చెప్పినవాడు వేయి సంవత్సరముల నుండి ఎక్కడా లేడని చెప్పవచ్చును. అటువంటి వానిని కూడా ఆయన చెప్పినది జ్ఞానమే కాదు అని హేళనగా మాట్లాడుచున్నారంటే, దానికి కారణము ఆయన బ్రాహ్మణుడు కాదు. వేమన 'రెడ్డి' కులమునకు చెందిన వాడు.

వేమన తర్వాత పేరుగాంచినవాడు పోతులూరి వీరబ్రహ్మము గారు. ఆయన మనుషులకు కాకుండా జరుగపోయే కాలానికి జ్యోతిష్యమును కాలజ్ఞానము అను పేరుతో చెప్పాడు. ఈ మధ్య కాలములో వేమనంతటి యోగి, బ్రహ్మముగారంతటి గురువు లేడను పేరు కూడా వచ్చినది. అయినా అంతటి వారిని కూడా అజ్ఞానులుగా చిత్రించి, వీరు మాట్లాడిన చర్చలోనే మాట్లాడారు. వారి పద్యమును చెప్పినవానిని నేను కూడా అజ్ఞానినే అన్నట్లు మాట్లాడినారు. ఇదంతా చూస్తే ఇతర కులముల వారు జ్ఞానులుగా చలామణి కాకూడదని, అలా అయితే వారికి పోటీగా వస్తారను భయముతో మాట్లాడుచున్నారు. వేమనను, బ్రహ్మము గారినే వీరు తక్కువ చేసి మాట్లాడితే నన్ను అసూయగా మాట్లాడక వదలరు కదా! అయితే నేను స్వామిని కాను, కాబోయే స్వాములకే మార్గదర్శకతను ఇచ్చు సిద్ధాంతకర్తనని వారికి తెలియదు. తెలిసినా నన్ను పైకి రానివ్వకుండా చేయాలనునదే వారి ఉద్దేశ్యము. ఇతర కులముల మీద ఆధారపడి బ్రతుకుతున్నది వారే అయినా ఇతర కులముల మీద విషము క్రక్కుచున్నారని ఇప్పుడిప్పుడే అన్ని కులముల వారు తెలుసుకుంటున్నారని, భవిష్యత్తులో వారికి మర్యాద లేకుండా పోతుందని తెలుసుకోలేక పోతున్నారు.

**ప్రశ్న :- T.Vలలో జరుగు చాలా చర్చావేదికలలో మేము బాగా గమనించితే మిమ్ములను ప్రజలకు దూరము చేయాలను భావముతో మీరు ఎక్కువగా దేవతలను దూషిస్తున్నారని చెప్పి చెడుగా ప్రచారము చేయుచున్నారు. మీ మీద వారికి పెద్దగా దొరికిన ఆరోపణ అదే. దానిని ఆయుధముగా ఉపయోగించు నట్లు ఉపయోగించుచూ, మిమ్ములను ప్రతిచోట విమర్శించుచూ రామున్ని దూషించాడనీ, దేవతలను నిందించాడని, ఇతర మత**

బోధలు చెప్పుచున్నాడనీ చెప్పుచున్నారు. మీ విషయము తెలిసినవారు, మీ గ్రంథములు చదివినవారు వారి మాటలను లెక్కచేయడము లేదు. వారు అసూయతో మాట్లాడుచున్నారని అంటూ వారి మీద ఎదురు దాడి చేసినట్లు మాట్లాడుచున్నారు. ప్రబోధానంద స్వామి చెప్పిన జ్ఞానములో కొద్దిపాటి జ్ఞానము కూడా మీ వద్ద లేదని, మీరు మాట్లాడే మాటలన్నీ ప్రబోధానంద స్వామిని అసూయగా మాట్లాడడము తప్ప ఏమీ లేదని అంటున్నారు. మీ జ్ఞానములో ఒక గ్రంథమును చదివినవారు గానీ, ఒక ప్రవచన మీటింగ్‌ను విన్నవారుగానీ వారి మాటలను లెక్కచేయక ఎదురు తిరిగి మాట్లాడుచున్నారు. మీ జ్ఞానము వలన జైళ్ళలో వున్న ఖైదీలు సహితము మార్పు చెందుచున్నారని, చెడు మార్గములో పోవువారు మంచి మార్గములోనికి వస్తున్నారని నేడు చాలామందికి తెలిసిపోయినది. ఒక విధముగా చెప్పితే మీరు T.Vలలో ఉపన్యాసములు ఇవ్వకున్ననూ, బయటికి వచ్చి ప్రచారము చేయకున్ననూ, ఎక్కడో ఎవరికీ కనిపించకయుండి, గ్రంథాల ద్వారానే జ్ఞానమును ప్రచారము చేసిననూ, మీ జ్ఞానము గత చరిత్రలో ఎప్పుడు ఎవరి జ్ఞానము ప్రాకనంత వేగముగా ప్రాకిపోయినది.

అంతేకాక మీ జ్ఞానమునకు అన్ని కులములవారు ఆకర్షితులవుచున్నారు. ఎప్పుడు జ్ఞానమంటే ఏమిటో తెలియని శూద్రులు, శూద్రులలో తక్కువ కులమువారని అంటున్న హరి

జనులు మొదలుకొని జ్ఞానమును గురించి మేము జ్ఞానులము అనుకొన్న బ్రాహ్మణులను ఎదిరించి మాట్లాడుచున్నారు. శూద్రులేకాక అందరికంటే మేము పెద్ద కులము వారము అను బ్రాహ్మణులు సహితము తమలోని అహమును లేకుండా చేసుకొని, ప్రబోధానంద స్వామే మాకు నిజమైన గురువు అంటున్నారు. కొందరు బ్రాహ్మణులు అలా మాట్లాడడము తమరు తయారు చేసిన "ద్రావిడ బ్రాహ్మణ సంఘము"లో సభ్యులుగా చేరి, సంఘమును నడిపించడమును చూచిన మరి కొందరి బ్రాహ్మణులకు ఏమాత్రము సరిపోలేదు. దానితో వారు మిమ్మలను చెడుగా ప్రచారము చేయదలచి, అట్లు కూడా వేరు దారి దొరకక మీరు దేవతలను దూషించారని, రామున్ని దేవుడు కాదన్నారని చెప్పడము మొదలు పెట్టారు. వీరి ప్రచారములో భాగముగా కొందరిని హిందువులను కూడా కలుపుకొని, వారి చేత ప్రబోధానందకు వ్యతిరేఖముగా సోషల్ మీడియాలో, యూట్యూబ్ ద్వారా, వాట్సాప్ మెసేజ్‌ల ద్వారా చెడుగా చెప్పించు చున్నారు. కొందరు పూట గడవనివారు, పనిలేక బ్రతకలేనివారు వారి బ్రతుకుతెరువు కోసము డబ్బులు తీసుకొని మిమ్ములను దూషించడము కూడా మాకు తెలుసు. మాకేకాక ఆ విషయము చాలామందికి కూడా తెలుసు. అందువలన వారి దుష్ప్రచారము మీ జ్ఞానము ముందర నిలువలేక పోవుచున్నది. ప్రతి దినము వందమంది ప్రకారము ప్రతి నెల మూడు వేలమంది మీ భక్తులుగా మారిపోవుచున్నారు.

మీరు ఏది చెప్పినా సత్యమే చెప్పుదురను నమ్మకము నేడు అందరిలో కలదు. ఒకప్పుడు మేము కూడా మిమ్ములను చెడుగా అనుకొన్నాము. తర్వాత మీరు ఏమి చెప్పుతున్నారో చూడాలని గ్రంథములను చదివాము. అప్పటి నుండి మేము కూడా మార్పుచెంది ఇతరులకు జ్ఞానము చెప్పు స్థోమత కల్గియున్నాము. మేమే కాదు మీ జ్ఞానము తెలిసిన జ్ఞానులతో తెలంగాణా రాష్ట్రములో కలిసాము. మేము కలిసినది టీచర్‌గా పని చేయుచున్న ముస్లీమ్‌తో. ఆయన మేము అడిగిన ప్రశ్నలకు తనవద్ద గల ఎనిమిది సంవత్సరముల పిల్లవానితో జవాబు చెప్పించాడు. అంత చిన్న వయస్సుగల అబ్బాయి మీ జ్ఞానమును తడబడకుండా చెప్పడము మాకు ఆశ్చర్యము వేసింది. అప్పుడు మాకు కొంత కనువిప్పుగా మీ జ్ఞానము ఎంత గొప్పదో అర్థమయింది. అయినా నేడు చాలామంది బ్రాహ్మణులుగా యున్న స్వామీజీలు, గురువులు, ఆధ్యాత్మికవేత్తలమనువారు మిమ్ముల గురించి చేయు దుష్ప్రచారమును గురించి మీరు ఏమి చెప్పుతారో వినాలని కోరికయున్నది. ముఖ్యముగా మీకు దేవతలంటే సరిపోదు అంటున్నారు. నేడు సమాజములో అందరూ అనగా హిందువులందరూ దేవతలను ఏదో ఒక రూపముగా ఆరాధించుచున్నారు. అటువంటి వారు మిమ్ములను చెడుగా అర్థము చేసుకొను అవకాశము గలదు. కావున దీనికి ఏమి జవాబు చెప్పదలచుకొన్నారు?

**జవాబు :-** నేడు సమాజములో బ్రాహ్మణులు బోధకులుగా, స్వామీజీలుగా, గురువులుగా, అనేక దేవాలయములలో పూజార్లుగా ఉంటూ, వారి ఆదాయమునకు మేము అడ్డు తగులునట్లు, వారి మర్యాదకు లోటు కలుగునట్లు, సమాజములో వారికున్న స్థానము పోతుందేమో అన్నట్లు భయపడి చివరికి ఏమీ చేయలేక వారి చేతనయినది దుష్ప్రచారమే అయినందున అందరూ కలిసికట్టుగా మాట్లాడుకొని, నన్ను చెడుగా చూపించాలని ఎన్నో ప్రయత్నములు చేస్తున్నారు. వారి లెక్కలో నన్ను శూద్రునిగా తలచి క్షుద్రమైనవారు శూద్రులని అనగా నీచమైనవారు శూద్రులని వారికి జ్ఞానము ఉండదన్నట్లు మాట్లాడుచున్నారు. నేటి విషయమేకాక పూర్వము నుండి వీరు ఎలా ప్రవర్తించుచున్నారో వివరముగా చెప్పెదను వినండి. గతములో మనుషులను నాలుగు భాగములుగా విభజించి, అందులో మొదటి రకము వారుగా, ఉన్నతులుగా, బ్రహ్మ జ్ఞానము తెలిసిన బ్రాహ్మణులుగా తమను తాము చెప్పుకొన్నారు. రెండవ స్థానములో కొంత తెలివైనవారిని ఉంచి వారిని వైశ్యులుగా చెప్పారు. మూడవ స్థానములో కొందరిని క్షత్రియులుగా పేర్కొన్నారు. అప్పటి కాల స్థితి గతులను బట్టి అలా ముందు మూడు రకముల వారిని తయారు చేయడము జరిగినది.

పూర్వము ప్రజలు పాలకులు అను రెండు రకములు ఉండేవారు. పాలకులలో వీరు ముఖ్యులు, వీరు కొంత ముఖ్యులు అని మూడు తెగలుగా ఉండేవారు. వారిలో మూడవ రకమైన క్షత్రియులను రాజుగా తయారు చేశారు. తర్వాత రెండవ రకము వారైన వైశ్యులను రాజు తర్వాత మంత్రిగా తయారు చేశారు. ఆ తర్వాత మొదటి రకమైన తమను రాజ గురువులుగా చెప్పుకొన్నారు. పైకి చూచేదానికి రాజు గొప్పయన్నట్లు కనిపించినా, మంత్రి సలహా తీసుకొనే రాజు పని చేయును. అందువలన రాజుకంటే మంత్రే ముఖ్యము. రాజు, మంత్రి రాజగురువు సలహా తీసుకొనే పని చేయుదురు.

కావున పైకి చివరివారుగా (మూడవవారుగా) బ్రాహ్మణులు యున్నా కనపడకుండా మొదటివారుగా బ్రాహ్మణులున్నట్లు చేసుకొన్నారు. చూడండి అప్పటి కాలములోనే ఎంత తెలివిని ఉపయోగించారో? పైకి కనిపించేటట్లు మొదటి వాడు రాజు, రెండవవాడు మంత్రి, మూడవవాడు గురువు అన్నట్లుండినా, కనిపించకుండా తతంగమును నడుపువారు మొదటివాడు గురువు, రెండవ వాడు మంత్రి, మూడవవాడు రాజుగా యున్నాడు. ఈ మూడు పదవులు కనిపించే విధముగా ఒక రకము, కనిపించని విధముగా మరొక రకముగా యున్నట్లు తెలిసిపోవుచున్నది. వీరు ముగ్గురు ఎట్లున్నా వీరే పాలించేవారు. పాలించబడే ప్రజలందరూ అనేక కులములుగా యున్నట్లు బ్రాహ్మణులే చీల్చారు. కులములను వాటి వృత్తులను బ్రాహ్మణులే నిర్ణయించారు. పాలించేవారు పవిత్రులని, ఉన్నతులని చెప్పుచూ, పాలించబడే ప్రజలు శూద్రులని, నీచులని చెప్పారు. శూద్రులు అనగా తక్కువ జాతివారని చెప్పుచూ, వారిలో కూడా అనేక కులములను కల్పించారు. చివరకు పంచములని అనగా ఐదవవారని అదే మాదిగ కులమని కూడా పేరు పెట్టారు. మొదట బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర అని నాలుగు భాగములుగా మనుషులను విభజించి తర్వాత శూద్రులలో నీచాతి నీచులన్నట్లు ఒక కులమును ప్రకటించారు. ఈ విధముగా తాము ఉన్నత స్థానములో ఉంటూ మిగతా వైశ్య, క్షత్రియులను కూడా కొంత విలువ నిచ్చి చివరిస్థానములో శూద్రులను తయారు చేశారు. అనగా దేవుడు సమానముగా పుట్టించిన ప్రజలను ఈ విధముగా బ్రాహ్మణులు చీల్చివేశారు.

ఈ విషయములు నేటి కాలములో ప్రజలకు తెలియవు. అప్పటి కాలములో అనగా పూర్వము రాజుల వ్యవస్థయున్నా కొన్ని ప్రాంతములకు ఒక రాజు ఉండేవాడు. రాజుకు గురువుగా ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు.

అట్లే మంత్రిగా ఒక వైశ్యుడు ఉండేవాడు. మిగతా వైశ్యులందరూ సులభముగా బ్రతుకు వ్యాపార వ్యవస్థను ఎంచుకోగా, వారికంటే సులభముగా బ్రతుకుటకు పురోహితులు, పూజార్లుగా మిగతా బ్రాహ్మణులు ఉండేవారు. మిగతా శూద్రులందరూ అన్ని పనులు చేయుచూ, జీవన వ్యవస్థ అందరికీ సమముగా జరుగునట్లు చూచెడివారు. మిగతా జీవన వ్యవస్థలో కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగళి అను అనేక పనులు చేయడమే కాక కొన్ని కులములను రైతులుగా భూమిలో పంటలను పండించేవారుగా నియమించారు. వైశ్యుల వద్దకు నిత్యావసర సరుకులకు ప్రజలు పోతారు కాబట్టి వాళ్ళు సులభముగా బ్రతుకగలరు. మిగతా పూజార్లు బ్రతకాలంటే అనేకమైన గుడులను, అందులో అనేకమైన దేవతలను తయారు చేసి పెట్టి ప్రజలను ఆయా దేవతా భక్తులుగా చీల్చివేశారు. ఆ పనిలో భాగముగా ఇంటి దేవుడు, కుల దేవుడు అని అందరికీ కల్పించారు. ప్రజలు సంవత్సరమంతా ఏమి పని చేసి బ్రతికినా తప్పనిసరిగా కొంత ముడుపు (డబ్బు రూపములో) కొంత ధాన్యములో సంవత్సరమునకు ఒకమారు ఇచ్చునట్లు ఏర్పాటు చేశారు. ఆ విధానము ఇప్పటికీ ఉన్నది. పూజార్లుగా యున్న తమవారైన బ్రాహ్మణులు గుడికి భక్తి రూపములో వచ్చిన ధన, దాన్యములతో సులభముగా బ్రతుకునట్లు చేశారు. తమ బ్రతుకుతెరువు కోసము ఏర్పాటు చేసిన దేవతా వ్యవస్థ ఈనాటికీ యున్నది. అట్లే వ్యాపార వ్యవస్థ కూడా నేటికీ గలదు. రాజులు, రాజ్యము వ్యవస్థ పూర్తి రూపు మాసిపోయినది. రాజవంశస్థులు నేడు బజార్లలో మూటలు మోయుచూ, అనేక అగచాట్లు పడుచూ, దొరికిన పని చేసుకొంటూ బ్రతుకుతున్నారు. క్షత్రియ వంశము, రాజులు అనే పేరుతో నేటికినీ గలదు గానీ, వారికి రాజ్యములు లేవు. బ్రాహ్మణుల కుట్రలో మొదటివారుగా కనిపించిన రాజులు నేడు శూద్రులలోనికి కలిసిపోయారని చెప్పవచ్చును.

బ్రాహ్మణులు మొదట వారి బ్రతుకుతెరువు కొరకు రాజుల కాలములోనే రాజుల చేత అనేక గుడులు గోపురములను కట్టించి, అందులో అనేకమైన దేవతలను పెట్టించారు. ఇదంతా వారి బ్రతుకు తెరువుకు చేయిస్తున్న కార్యములని ఆనాటి క్షత్రియులకు తెలియదు. కృష్ణ దేవరాయల కాలములో అనేకముగా గుడులు తయారయినట్లు చరిత్ర చెప్పుచున్నది. రాజుల కాలములో ఎన్నో యుద్ధములు జరిగినా తాము రెండవ వారము, మూడవవారము అన్నట్లు గురువులు మంత్రులు యుద్ధము చేసెడివారు కాదు. రాజులు, రాజు క్రిందగల సైన్యము యుద్ధము చేసేది. అటువైపుగానీ ఇటువైపుగానీ రాజులు, సైన్యము చచ్చేవారు. రాజ గురువులు, మంత్రి చనిపోయేవారు కాదు. ఇట్లు ఎంతో తెలివిగా ఒక వ్యూహమును తయారు చేసుకొని ఆ వ్యూహము ప్రకారము తాము క్షేమముగా యుంటూ తమవారు బ్రతికేదానికి దేవతా వ్యవస్థను తయారు చేశారు. దాని ప్రకారము ఇప్పటికీ ప్రతి కులమువారికి ఇంటి దేవుడు ఒకరు, కుల దేవుడు ఒకడు తప్పక ఉంటారు. మా పెద్దలు ప్రతి సంవత్సరము అహోభిలము నరసింహ స్వామికి బియ్యము, బేడలు (పప్పులు), కొంత డబ్బు దక్షిణగా చెల్లించి వచ్చేవారు. ఇట్లు ఎందరో వచ్చి బియ్యము, బేడలు, డబ్బు ఇవ్వగా అది వారికి సులభముగా బ్రతికేదానికి ఉపయోగపడేది. ఈ విధముగా అనేక కష్టములకు ఓర్చుకొని అడవులలో ఉండే దేవుళ్ళ దగ్గరకు పోయి ప్రజలు ముడుపులు చెల్లించుకొనేవారు. ఇట్లు ప్రజలందరికీ అన్ని కులముల వారికి దేవతలను ఆరాధించడము త్రేతా, ద్వాపరయుగముల నుండి మొదలయినది. కొన్ని చోట్ల శిథిలావస్థలో యున్న ముందు యుగము దేవాలయములు కూడా అక్కడక్కడ కనిపిస్తావుంటాయి. ఇలా దేవతా వ్యవస్థ మొదలై ప్రజలు దేవతా భక్తులుగా మారిపోయారు.

కృతయుగములో అందరూ జ్ఞానులుగా యుండి ఇందువులు అని పేరుగాంచిన ప్రజలు కొద్దికొద్దిగా తమ జ్ఞానమును కోల్పోయి చివరకు సృష్టికర్తయిన పరమాత్మను మరచిపోయి, తమలో యున్న ఆత్మను తెలియక పూర్తి మాయలో పడిపోయి ప్రజలందరూ అనేక దేవతల భక్తులుగా ఉండడము నేడు చూస్తూనేయున్నాము. ద్వాపర యుగము చివరిలో నాలుగు అధర్మములు పూర్తిగా చెలరేగిపోయి ముప్పై (30) కోట్ల ప్రజలకు మూడు కోట్ల దేవతలు తయారైనారు. అనగా పది మందికి ఒక దేవుడు తయారయినారన్నమాట. ఇట్లు దేవతా వ్యవస్థ తయారు కాగా, అందులో కొందరు ముఖ్యమైన దేవతలుగా నిలచిపోగా, కొందరు గ్రామ దేవతలుగా, పొలిమేర దేవతలుగా కొందరు నిలచిపోయారు. ఇంతమంది దేవతలలో చిక్కుకొన్న ప్రజలకు తమను సృష్టించిన దేవుడు ఎవరో తెలియకుండా పోయినది. ఇటువంటి పరిస్థితి ఏర్పడుతుందని తెలిసిన దేవుడు సృష్ట్యాది లోనే తనను గురించిన జ్ఞానమును ఆకాశము ద్వారా సూర్యునికి తెలియజేసి యున్నాడు. భూమిమీద మాయా ప్రభావము చేత జరుగుచున్న దేవతల అజ్ఞానము నుండి ప్రజలను మరల్చుటకు, సూర్యుడు భూమిమీద గల మనువుకు దేవుని జ్ఞానమును మాటల రూపములో చెప్పిపోయినాడు. అలా మాటల రూపములో చెప్పబడిన దేవుని జ్ఞానము **"జపర"** అను పేరుతో అలాగే యుండేది.

భూమిమీద ద్వాపర యుగము చివరికల్లా నాలుగు అధర్మములు పెరిగిపోయి దేవుని ఉనికి తెలియకుండా పోయి దేవతలే మిగిలి పోయినప్పుడు దేవుడు మనిషివలె పుట్టి భూమిమీద మొదట సూర్యుడు చెప్పిన జ్ఞానమును తిరిగి చెప్పాడు. కృష్ణుని రూపములో అర్జునునికి 'జపర' జ్ఞానము చెప్పగా, అప్పుడు అది వ్యాసుని ద్వారా గ్రంథరూపమై భగవద్గీతయను పేరు పెట్టబడినది. అదే భగవద్గీత కలియుగములో మోషే

ప్రవక్తకు స్వప్నములో కృష్ణుడే స్వయముగా ఇచ్చాడు. అప్పుడు ఆ గ్రంథము పేరు "తౌరాతు"యని చెప్పి ఇచ్చాడు. తర్వాత కాలములో మోషే ప్రవక్త మూస ప్రవక్తగా చెప్పబడినాడు. ఆయన పేరు ఎట్లు మారినా మూస ద్వారా భగవద్గీత (తౌరాతు) జ్ఞానము ప్రజలలోనికి పోయినది. అదే బైబిలుగా రూపు దిద్దుకొన్నది. అదే భగవద్గీత జ్ఞానమునే తిరిగి రెండవమారు జిబ్రయేల్ అను పేరుతో ముహమ్మద్ ప్రవక్తగారికి హీరా గుహలలో బోధించడము జరిగినది. అలా బోధించినదే అంతిమ దైవగ్రంథము అను పేరుతో ఖుర్ఆన్‌గా నేడు మనముందున్నది. ఇదంతా గమనిస్తే జపర జ్ఞానము భగవద్గీత (తౌరాతు) గా గ్రంథరూపము దాల్చగా, అదియే కలియుగములో ఇంజీలు (బైబిలు)గా తయారైనది. తర్వాత కొంతకాలమునకు అనగా దాదాపు 1400 సంవత్సరములప్పుడు అంతిమ దైవగ్రంథము ఖుర్ఆన్‌గా తయారైనది.

దేవుని జ్ఞానము మనుషులకు మూడు గ్రంథములుగా దిగి వచ్చినది. మనుషుల మీద ప్రేమతో దేవుడు తన జ్ఞానమును మూడు గ్రంథములుగా ఇవ్వగా, మనుషులు మాయ (సాతాన్ లేక ఇబ్లీస్) ప్రభావములో చిక్కుకొని ఒకే దేవుని జ్ఞానమున్న మూడు గ్రంథములను మూడు మత గ్రంథములుగా చెప్పుకొంటున్నారు. మా గ్రంథమువేరు, మీ గ్రంథము వేరని అనుకోవడము జరుగుతాయున్నది. మాదివేరు మీదివేరన్నట్లు చెప్పుకోవడమేగాక ఒకరి మీద ఒకరు మతద్వేషములు పెంచుకొన్నారు. పూర్వము ద్వాపరయుగములో భగవద్గీత చెప్పినప్పుడు అధర్మములు నాలుగు ఉండగా, నేడు మతము అను అధర్మము ఒకటి పెరిగి మొత్తము ఐదు అధర్మములు మనిషిని దేవుని వైపు పోకుండా చేసినవి.

భగవద్గీత భారతదేశములో 5000 సంవత్సరముల పూర్వము తయారు కాగా, బైబిలు రెండువేల సంవత్సరముల పూర్వము తయారైనది.

అట్లే మూడవ దైవగ్రంథము ఖుర్ఆన్ 1400 సంవత్సరములప్పుడు తయారయినదని అందాసుగా చెప్పవచ్చును. బైబిలు గ్రంథము తయారై రెండువేల సంవత్సరములయితే, దాని తర్వాత 600 సంవత్సరములకు ఖుర్ఆన్ తయారయినది. వెనుక తయారైన రెండు గ్రంథములలోని జ్ఞానము తెలుసుకొని ఇటు క్రైస్థవులు, అటు ముస్లీమ్‌లు దేవుడు ఒక్కడే, ఒక్కనినే ఆరాధించాలను భావముతో యుండి ఇతర దేవతల జోలికి ఎవ్వరూ పోలేదు. వెనుక తయారయిన రెండు గ్రంథములకంటే మూడువేల సంవత్సరముల ముందు భగవద్గీత తయారైనా హిందువులకు దేవుడు ఒక్కడేయనిగానీ, ఒకే దేవున్ని ఆరాధించ వలెననిగానీ తెలియకుండా పోయినది. వెనుక పుట్టిన గ్రంథములను చదివి ఒకే దేవుడు, ఒకే ఆరాధనయని అంటున్న ముస్లీమ్‌లను చూస్తే వారికంటే 3600 సంవత్సరముల ముందు పుట్టిన భగవద్గీతను చదివిన వారు ఎందుకు ఒకే దేవుడు, ఒకే ఆరాధన అనలేకపోవుచున్నారంటే కొంచెము వెనక్కుపోయి ఆలోచించండి.

వెనక్కుపోయి చూస్తే ద్వాపరయుగములో భగవద్గీత పుట్టకముందే త్రేతాయుగము నుండే బ్రాహ్మణులు పన్నిన వ్యూహము వలన భగవద్గీత వచ్చినప్పటికీ హిందువులు తెలుసుకోలేకపోవుచున్నారు. దేవతలను వదలించుకొని మనలను సృష్ఠించిన దేవుడెవరు అని ఆలోచించలేక పోవుచున్నారు. ఎక్కడయినా సత్యమును చెప్పు వేమనలాంటివారు వస్తే వారిని అణచివేసి, వారు చెప్పినది జ్ఞానమే కాదంటున్నారు. వేమన లాంటి వారిని, వీరబ్రహ్మములాంటి వారిని అజ్ఞానులని ప్రచారము చేసినప్పటికీ, వేమన కులస్థులయిన రెడ్డి కులము వారు, వీరబ్రహ్మము కులస్థులయిన విశ్వబ్రాహ్మణులు (ఆచారులు) బ్రాహ్మణులు మా పెద్దలను మమ్ములను అవమానము చేసినారని గుర్తించలేకపోయారు. తిరిగి అన్ని కార్యములకు

బ్రాహ్మణులనే ఆశ్రయించుచున్నారు. అటువంటి వారి చెంత చేరకుండా, వారు చేసిన మోసమును బయట పెట్టవలసినది పోయి నిమ్మకు నీరు ఎత్తినట్లున్నారు. అట్లుండడమేకాక చరిత్రలో జరిగిన అన్యాయమును బట్టబయలు చేసిన నన్ను విమర్శిస్తున్నారంటే ఏది తప్పు, ఏది ఒప్పు అని గ్రహించలేకున్నారని తెలియుచున్నది.

ఇటువంటి పరిస్థితులలో బ్రాహ్మణులు తమ బుద్ధికి ఇంకా పదును పెట్టి, నేడు అనేక శాఖలలో తమవారిని ప్రవేశపెట్టి, వారి చేత రాజకీయ బలమును సంపాదించి, భవిష్యత్తులో మాలాంటి వారిని పైకి రాకుండా చేసి, పూర్వము నుండి వారు చేయుచున్న కుట్రలు బయటపడకుండా చేసుకొనుటకు ప్రయత్నము చేయుచున్నారు. అటువంటి ప్రయత్నములో భాగముగా నేడు R.S.S లోను, B.J.P లోను చేరి ఉండడమేకాక వీరి ద్వారా మిగతా ప్రజలను రెచ్చగొట్టి మా జ్ఞానమును ప్రచారము కాకుండా చేయుచున్నారు. విశ్వహిందూ పరిషత్ అను సంస్థను కూడా తయారు చేసి, వారి ద్వారా మాలాంటివారు ఎక్కడయినా తయారయి వారి బండారమును బయటపెట్టకుండా అనుమానము వచ్చిన వారి మీద భౌతిక దాడులు చేయిస్తున్నారు. ఇటువంటి ఇబ్బందులను స్వయముగా మేము ఎదుర్కొన్నాము. దీనినిబట్టి మేము వారికి కంటకముగా తయారవుతామని గ్రహించి, ప్రజలలో వారి గౌరవమును కాపాడుకొనే దానికి మా మీద, మా భక్తుల మీద దాడులకు ఉసికొల్పారని గ్రహించాము. ఇన్ని కార్యములు వారు చేయుచూ, ప్రజలను అజ్ఞానము వైపు తోస్తున్నా, వీరు ఏమి చేయుచున్నారని గ్రహించక కొందరు శూద్రులు కూడా వారి వశమై వారి మాట మాట్లాడుచూ మా మీద దాడికి దిగుతున్నారు. అమాయక ప్రజలను రెచ్చగొట్టి మమ్ములను, మా జ్ఞానమును నోరు మూయించలేరని మేము పదే పదే చెప్పుచున్నాము. అయినా వారి ఆట వారు ఆడుచున్నారు.

నేను ఏమాత్రము అధైర్యపడక నా పనిని నేను చేస్తున్నాను. ఏదెట్లయినా ప్రజలు తమ బుద్ధిని ఉపయోగించి చరిత్రలో ఏమి జరిగింది, ఇప్పుడు ఏమి జరుగుతాయుంది అని ఆలోచించనంత వరకు సమాజములో మార్పు రాదు. అందువలన అందరినీ ఆలోచించమని చెప్పుచున్నాను.

అన్నిటికంటే వెనుక వచ్చిన గ్రంథములో అనగా ఖుర్ఆన్‌లో భగవద్గీతలో చెప్పినమాటలే గలవు. భగవద్గీత ఆధారిత జ్ఞానమే ఖుర్ఆన్‌లో ఉన్నదని స్వయముగా ఖుర్ఆన్‌లోనే ఐదవ సూరాలో చెప్పియున్నారు. భగవద్గీత ప్రథమ దైవగ్రంథముకాగా, ఖుర్ఆన్ అంతిమ దైవగ్రంథము. చివరిలో ఆలస్యముగా వచ్చిన ఖుర్ఆన్‌ను అనుసరించు ముస్లీమ్‌లు ఒకే దేవున్ని ఆరాధించుచున్నారు. ఈ విషయము మొదటి దైవ గ్రంథమయిన తౌరాతు (భగవద్గీత) లో యున్నా, హిందువులు ఎవరూ ఏకేశ్వరోపాసన చేయడము లేదు. దానికి కారణము త్రేతాయుగము నుండి ఉన్నదని చెప్పుకొన్నాము. ఈ విషయము కొంత అర్థమగులాగ ఒక ఉపమానమును చెప్పుకొందాము. పూర్వము హిందూ మతములో ఒక ఆచారముండేది. అది నేను పది సంవత్సరముల చిన్నవయస్సులో కూడా చూచాను. అంటే దాదాపు 60 సంవత్సరముల క్రిందట కూడా అక్కడక్కడ కొన్ని పల్లెలలో ఆ ఆచారము ఉండేది. ఇప్పుడు ఆంధ్రలో అది ఎక్కడా లేదనుకొంటాను. ఆ వింతయిన ఆచారమును చిన్నప్పుడు పెద్దలనడిగి వివరముగా తెలుసు కొన్నాను.

ఒక ఊరిలోని ఒక కుటుంబములో యుక్తవయస్సు వచ్చిన యువతిని పెళ్ళి చేయకుండా వదలివేస్తారు. ఆమెకంటూ ఒక భర్త ఉండడు. ఆమెను బసువురాలు అని బసవి అని అనెడివారు. ఆమెను అలా వదలివేయడము వలన ఆమెవద్దకు వారమునకు ఒకరు ఊరిలో

మగవారు వచ్చి ఆమెతో గడిపిపోయేవారు. ఊరిలోని వారందరికీ ఆమె వేశ్యలాగ ఉంటుంది. ఎవరు ఆమెవద్దకు వస్తే ఆ రోజు అతనే భర్తగా భావించేది. అయినా ఆమెను వేశ్య అని అనరు. ఆమెను దేవుని సేవకు వదలినామని ఆ కుటుంబమువారు చెప్పెడివారు. ఈ సాంప్రదాయము కర్నాటక ప్రాంతములో ఇప్పుడు కూడా ఉంది అని వినికిడి. ఆమెవద్దకు వచ్చినవారు ఇచ్చిన ధనముతో ఆమె కాలము గడిపేదేకాక మిగిలిన ధనముతో దేవుని సేవ చేసేది అని విన్నాము. ఎట్లయినా ఆమె జీవితమునకు ఒక భర్తంటూ ఉండడు. ఆమెను బసవి అని అక్కడ వారు అనినా చేసేది వేశ్యవృత్తే కదా! అదే విధముగా మనుషులు కూడా భక్తి విధానములో బసవి లేక బసవురాలు మాదిరి తయారైనారు. ఆమెకు ఒక భర్తంటూ ఉండడు. అలాగే మనిషికి ఒక దేవుడంటూ ఉండడు. బసవురాలు దగ్గరకు వచ్చిన వాడినే ఆ రోజు భర్తగా భావిస్తుంది. అలాగే మనిషి ఏ గుడికిపోతే ఆ గుడిలోని విగ్రహమునే దేవుడు అని అనుకొంటున్నాడు. బసవురాలు పోలికకు నేడు మనుషులలోని భక్తికి పోలిక పూర్తి సమానముగా యున్నట్లు తెలియుచున్నది.

నేడు ముఖ్యమైన మూడు మతములలో ఒక్క హిందూ మతములోనే అనేక దేవుళ్ళు, అనేక పూజలు, అనేక ఆచారములు గలవు. ఈ విధానము మిగతా మతములకంటే మంచిదా లేక చెడుదాయని ఆలోచిస్తే దానిని మనము శాస్త్రమును ప్రమాణముగా చూడవలసియున్నది. శాస్త్రప్రమాణము లేకపోతే ఎవరంతకు వారు మాదే మంచి పద్ధతియని అంటారు. ఇది భక్తి మార్గము కాబట్టి దీనికి బ్రహ్మవిద్యా శాస్త్రమునే చూడవలసియున్నది. బ్రహ్మవిద్యా శాస్త్రము అను పేరుతో ప్రత్యేకమైన గ్రంథములు ఏవీ లేవు గానీ, దేవుడు మనకు అందించిన మూడు దైవగ్రంథములు బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించినవేయని చెప్పవచ్చును. మొట్టమొదట ప్రథమ

దైవగ్రంథముగా పేరుగాంచిన భగవద్గీతను (తౌరాత్)ను చూస్తే అందులో దేవుడు చెప్పిన జ్ఞానమునుబట్టి మనము చేయునది వేశ్యా భక్తియని తెలియుచున్నది. నేను ఆ మాట చెప్పితే ఎవరూ ఒప్పుకోరు. మేమంతా సంసారులమే అన్నట్లు మాట్లాడారు. ధర్మపీఠము శీర్షికలో "ప్రబోధ ఉన్మాదము" పేరు పెట్టి నా మీద చర్చించినవారు నేను హిందూ సాంప్రదాయములను పాటించలేదని, హిందూ సాంప్రదాయముల ప్రకారము దేవతలను పూజించడము లేదని చెప్పడమేకాక మిగతా స్వాములు, గురువులు అందరూ హిందూ దేవతలను గౌరవించి పూజిస్తూ ఉంటే ఈయన దేవతలకు వ్యతిరేఖముగా మాట్లాడుచున్నాడు. ఒక్కడే దేవుడు మిగతా వారు దేవుళ్ళు కాదంటాడు. ఈయన ఉన్మాదము బాగా పెరిగిపోయింది. ఆయన ఉన్మాదమును అందరికీ అంటించుచున్నాడు. త్రైత సిద్ధాంతము అను పేరుతో ఇతర మతస్థులవలె హిందూ సాంప్రదాయములను మంట గలుపుచూ, దేవతలనందరినీ అవమానించు చున్నాడు అని ఆరోపించడము జరిగినది.

వాస్తవమే! వారు చెప్పినట్లు నేనుండేది వాస్తవమే. అయితే నా దారికొద్ది నేను సక్రమముగా నడుస్తున్నాను అని నేను అంటున్నాను. దానికి వారు ప్రబోధానంద దారి సక్రమమైనది కాదు. మేము చెప్పినదే సరియైన దారి అని వారంటున్నారు. ఎవరికి వారు నేను పోవునదే సత్యమార్గము అంటే ఎవరిది సత్యము, ఎవరిది అసత్యము అని తేల్చు చెప్పువారు ఎవరు అని ప్రశ్నించి చూస్తే, సత్యాసత్యములను తేల్చవలసినది దేవుడే. దేవుడు మాట్లాడడు, కావున ఈ విషయము కొరకు ముందే ఆయన బ్రహ్మావిద్యా శాస్త్రమునకు సంబంధించిన గ్రంథములను మనకు ఇచ్చాడు. ఆ మూడు గ్రంథములలో ఒకే నిర్ణయము, ఒకే సత్యము కలదు. దానినిబట్టి మనము ఎవరిది సత్యము, ఎవరిది అసత్యము అని తేల్చి చెప్పవచ్చును.

భగవద్గీతలో క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము అను అధ్యాయములో పదకొండవ శ్లోకము ఈ విధముగా కలదు.

**13-11 శ్లో॥ "మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ"**

ఈ శ్లోకములో చెప్పిన విషయము ఏమనగా! భక్తిలో మీరు వ్యభిచారము చేయవద్దండి. ఇతర చింత లేకుండా, నా మీదనే యోగమును ఆచరించమని చెప్పాడు. యోగము అనగా కలయిక, నాతో కలువాలని ఇతర ధ్యాసలు ఏమాత్రము లేకుండా భక్తిగా యుండవలెనని, అట్లుకాకుండా నన్నేకాక ఇతరుల మీద కూడా మీకు భక్తి ఉంటే మీరు భక్తిలో వ్యభిచారము చేసినవారగుదురు అని చెప్పడమైనది. అంతేకాక రాజవిద్యా రాజగుహ్య యోగములో 23వ శ్లోకములో మరియు 25వ శ్లోకములో ఇట్లు చెప్పుచున్నారు చూడండి.

9-23 శ్లో॥ ఏ ప్యన్య దేవతా భక్తాః యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేపి మామేవ కౌంతేయ యజ్యన్త్య విధి పూర్వకమ్ ॥

9-25 శ్లో॥ యాంతి దేవవ్రతాన్ దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః ।
భూతాని యాంతి భూ తేజ్యాః యాంతి మద్యాజినోపి మామ్॥

ఈ రెండు శ్లోకములలో చెప్పినది ఏమనగా! ఒకవేళ నీవు నన్ను కాదని ఇతర దేవున్ని పూజిస్తే నాకు ఏమీ అసూయ లేదు. అది కూడా నన్ను పూజించినట్లే నేను భావించుదును అయినా, నీవు దారితప్పి నడచిన వాడవు అవుతావు. ఒకే దారిలో నడిచేవానిని సంసారి అంటాము. ఒక దారిలో కాకుండా వేరు దారులలో నడిచేవానిని వ్యభిచారి అనవచ్చును అని చెప్పినట్లు కలదు. అంతేకాక నీవు ఆచరించే దానినిబట్టి నీకు ఫలితము ఉంటుంది. **నీవు దేవతలను మ్రొక్కితే దేవతలలోనికే పోతావు. పెద్దలను**

**మ్రొక్కితే పెద్దలలోనికే పోతావు. జీవరాసులను మ్రొక్కితే జీవరాసుల లోనికే పోతావు. నన్ను మ్రొక్కినవాడు మాత్రము నావద్దకు వచ్చును** అని అన్నారు. ఈ విషయమును వివరముగా చెప్పితే ఒక స్త్రీ బ్రాహ్మణున్ని పెళ్ళి చేసుకొంటే బ్రాహ్మణుల ఇంటిలోనికి పోతుంది. బ్రాహ్మణులుగానే లెక్కింపబడుతుంది. ఆ స్త్రీ బ్రాహ్మణున్ని పెళ్ళాడక ఒక రెడ్డిని పెళ్ళాడితే రెడ్డి ఇంటికి చేరి రెడ్డి అమ్మాయిగా లెక్కించబడుతుంది. అట్లుకాకుండా కంసాలిని పెళ్ళి చేసుకొంటే కంసాలి వారిలోనికి కలిసిపోతుంది. ఈ విధముగా ఎవరిని పెళ్ళాడితే వారి ఇంటికి పోయినట్లు, దేవతలను పూజించు వాడు దేవతల చెంతకి చేరును, జీవరాసులను పూజించువాడు జీవరాసుల చెంత చేరును. అట్లే దేవున్ని అనగా ఆత్మను పూజించువాడు ఆత్మనే చేరును, ఇదే విషయమునే 25వ శ్లోకములో చెప్పియున్నారు. నీవు జీవాత్మవు కావున ఆత్మనే ఆరాధిస్తే ఆత్మ చెంతకే చేరిపోతావు. అట్లుకాకుండా వ్యభిచారివలె ప్రవర్తించక, నీవు ఆత్మవైయుండి ఆత్మకానివారి చెంతకు పోకుండా ఆత్మనే చేరడము మంచిది.

ముఖ్యముగా భక్తి అనునది జీవితములో ఒక భాగముగా యున్నది. జీవితములో ఒక అంశముగా యున్న భక్తిని అనేక దేవతల మీద పెట్టుకోకుండా ఒకే దేవుని మీద పెట్టుకొంటే నీవు ఒక భర్తతో కాపురము చేసిన సంసారివి అవుతావు. అట్లుకాకుండా వారమునకు ఒక దేవున్ని, నెలకు ఒక దేవున్ని మార్చి ఆరాధిస్తే అది భక్తిలో వ్యభిచారమగునని భగవద్గీతలో దేవుడు **"భక్తిరవ్యభిచారిణి"**యని చెప్పాడు. వారములో ఏడు రోజులు ఏడు దేవతలను ఆరాధిస్తే అది నిత్యము వ్యభిచారము చేసినట్లగును. శనివారము ఒక దేవున్ని, మంగళవారము ఒక దేవున్ని, గురువారము ఒక దేవున్ని భక్తిగా ఆరాధించినా, అది వ్యభిచార భక్తియని భగవద్గీతలో చెప్పారు.

భగవద్గీతలో ఎంతో విపులముగా చెప్పారు. మిగతా రెండు గ్రంథములలో ఇంత లోతుగా చెప్పకపోయినా, ఇతర దేవతలను ఆరాధించ కూడదు అని ఒక్కమాట చెప్పితేనే, ఆయా మతమువారు ఆ మాటకు కట్టుబడి ఏమాత్రము ఇతర దేవుళ్ళను మ్రొక్కక తమ దేవున్ని ఒక్కనినే మ్రొక్కుచున్నారు. దీనినిబట్టి ఇతర మతములవారు ఒకే భర్తను కల్గిన సంసారులులాగా ఉండగా, కేవలము హిందూమతము ఒక దేవుడంటూ ఏమీ లేకుండా మా భక్తి విశాలమయినది, మేము అందరి దగ్గరికి పోయి మ్రొక్కుతాము అంటే వేశ్య కూడా విశాల భావముతో విశాలముగా అందరి వద్దకు పోవుచున్నది కదా!యని భగవద్గీతలో 'భక్తిలో వ్యభిచారము చేయవద్దని' చెప్పుచున్నారు. ఇదంతయు దేవతలను మ్రొక్కువారి మీద అసూయతో చెప్పడము లేదు, మీరు నిజమైన జ్ఞానులుగా ఉండవలెనని అట్లుంటే మిమ్ములను దేవుడు సంసారులంటాడని, అట్లుండకపోతే మిమ్ములను దేవుడు వ్యభిచారులుగా చెప్పుచున్నాడని జ్ఞాపకము చేయుచున్నాను. ఇన్ని చెప్పిన నేను సంసారినా, వ్యభిచారినా అన్నది మీరే చూచుకోండి.

ఒక స్త్రీ తాను సంసారియైతే ఎప్పటికీ ఒకే పురుషున్ని భర్తగా నమ్ముకొని ఉంటుంది. అట్లుకాకుండా తాను వ్యభిచారియైతే ఒక రోజులో ఒక్క పురుషునితో గానీ, ఇద్దరితో గానీ, ముగ్గురితోను గానీ తన ఓపికను బట్టి ఎంతమందితోనయినా కాపురము చేయవచ్చు. నేను ఒకప్పుడు కొంత కాలము తమిళనాడులో యుంటిని. అప్పుడు ఒక ప్రక్క వేశ్య ఇల్లు ఉండగా, మరొక ప్రక్క ఒక పూజారి ఇల్లు ఉండేది. పూజారి ఉదయము లేస్తూనే నిత్యకృత్యములన్నీ అయిపోయిన వెంటనే ఊరిలోయున్న విఘ్నేశ్వర గుడికి పోయి మ్రొక్కివచ్చెడి వాడు. అది ఆరు గంటలకే అయిపోగా తాను శివుని గుడిలో పూజారి పని చేయుచుండుట వలన వెంటనే పంచకట్టుకొని శివుని గుడికి పోయి పూజ కార్యక్రమము చేయును. శివుని పూజ

అయిపోయిన వెంటనే అదే గుడిలో కుడి ప్రక్కయున్న ఆంజనేయ స్వామికి పూజ కార్యక్రమము చేసి, తర్వాత ఎడమ ప్రక్కయున్న మాధవ స్వామికి పూజ చేయును. ఆ గుడిలోని ముగ్గురి దేవతల పూజలు అయిపోయిన వెంటనే అక్కడికి కొంత దూరములో యున్న ప్రత్తి ఫ్యాక్టరీకి పోయి ఆఫీసులో గల లక్ష్మికి పూజ చేసివచ్చును. ఇట్లు ఉదయము నుండి క్రమము తప్పకుండా పది గంటలలోపు ఐదుమందికి మ్రొక్కుచున్నాడు. ఆ పూజారిని అందరూ గౌరవించెడివారు. ఒక ప్రక్క పూజారి మరొక ప్రక్క వేశ్య ఇద్దరికీ మధ్యలో నేనున్నాను.

ఒక రోజు బావి దగ్గర త్రాడు విషయములో పూజారికి, వేశ్యకు మధ్యలో తగాదా వచ్చినది. అప్పుడు ఒకరికొకరు తిట్టుకోవడము జరిగినది. పూజారి వేశ్యను తిట్టుచూ "దినానికి ఇద్దరు ముగ్గురి దగ్గరకు పోయేదానికి నీకేమి తెలుస్తుందే నా విలువ" అన్నాడు. అప్పుడు ఆమె "నేను ఇద్దరి దగ్గరికి పోతే నీవు పది గంటలకే నలుగురి దగ్గరకు పోతావే అది బాగుందా? ఒక్కొక్క రోజు నా దగ్గరకు ఒక్కడు కూడా రాకున్నా నేను నీతిగానే బ్రతుకు చున్నా, నీవు ప్రతీ రోజు నలుగురు దగ్గరకు పోయి వ్యభిచారము చేస్తా వుండావే అయినా నా మాదిరి నీతిగా బ్రతుకుతున్నావా నీ పాతతాడు ఇక్కడ వేసి నా క్రొత్త తాడు తీసుకపోయావే" అని అడిగింది. అప్పుడు వీరి పోట్లాట నాకు ఏమీ అర్థము కాలేదు. ఇప్పుడు భగవద్గీతలో "భక్తి రవ్యభిచారిణీ" అను వాక్యము చూచినప్పుడు అర్థమయినది.

ఆమెది అనగా వేశ్యది శారీరక వ్యభిచారము కాగా, పూజారిది మానసిక వ్యభిచారము అని తెలిసింది. తర్వాత నేను స్వయముగా **"కర్మపత్రము"** అను చిన్న గ్రంథములో పూజారి మానసిక పాపము చేసి నరకానికి పోయాడనీ, అట్లే వేశ్య మానసిక పుణ్యము చేసి స్వర్గానికి పోయిందని వ్రాశాము. అక్కడ ఆ కథను ఇక్కడ ఈ పోట్లాటను చూచిన

తర్వాత శారీరక వేశ్యకంటే మానసిక వేశ్యలు ఎక్కువ పాపము సంపాదించు కుంటారని అర్థమయినది. సమాజములో పేరుపొందిన పెద్ద స్వామీజీ భగవద్గీత ప్రవచనములు చెప్పుతాడు, ఉదయమే అమ్మవారి గుడికి పోయి మ్రొక్కివస్తాడు. అట్లే ఆయన ఏ ఊరికి ఉపన్యాసమునకు పోయినా అక్కడ ఏ గుడియున్నా అందులో ఏ దేవుడున్నా అక్కడికి పోయి మ్రొక్కి రావడము ఆయనకు ఆనవాయితీగా జరిగే పని. దేశములో ఎంతో పెద్ద స్వామి అనిపించుకొన్న ఆయన భగవద్గీత ప్రవచనములను చెప్పుచూ, అన్య దేవతలకు మ్రొక్కుతున్నాడంటే ఆయన భక్తిలో వ్యభిచారమున్నట్లే కదా! ఆ లెక్కప్రకారము చూస్తే భూమిమీద ఏ స్వామి అయినా, ఏ గురువు అయినా, ఏ బాబా అయినా ఒకే దేవునితో కాపురము చేయక, అనేకమంది దేవతలతో కాపురము చేయుచుండుట వలన వ్యభిచారి కాని స్వామి లేరు అని చెప్ప వచ్చును. హిందూ మతములో దేవతలందరినీ మ్రొక్కడము సాంప్రదాయము అని చర్చావేదికలో చెప్పుచున్నారే, నేను అలా దేవతలను మ్రొక్కలేదని నన్ను చెడుగా మాట్లాడుచున్నారే దానిని చూస్తే మేమంతా చెడిపోయినప్పుడు నీవెందుకు చెడిపోలేదు అని అడిగినట్లున్నది. చెడిపోయేదే మన సాంప్ర దాయమయినప్పుడు, నీవు ఎందుకు చెడిపోలేదని వారు నన్ను అడిగి నట్లున్నది.

చివరిగా నేను ఒకే మాటను చెప్పుచున్నాను. **హిందువుల యందు భక్తిలో సంసారులు ఒక్కరయినా ఉన్నారా? చెప్పగలరా?** అలా ఫలానావాడు భక్తిలో వ్యభిచారి కాదు అని చూపండి నేను నడిరోడ్డు మీద అతని పాదాలకు నమస్కారము చేస్తాను. నాకు తెలిసి నేను బ్రహ్మ విద్యాశాస్త్రమయిన భగవద్గీత ప్రకారము స్వచ్ఛమైన సంసారిగా యున్నాను. బ్రహ్మవిద్యను అనుసరించి స్వాములలో కనీసము ఒక్క స్వామి కూడా సంసారిగా కనిపించకపోతే, సామాన్య ప్రజల విషయము వేరే చెప్పనవసరము

లేదు. స్వాములు చెప్పినట్లు ప్రజలు నడుస్తుందురు. కావున వారు వేశ్యలై అందరినీ వేశ్యలుగా చేస్తున్నారు. చివరకు ఒకే దేవున్ని గురించి మూడు మతములలో చెప్పుచూ, ఒక్క దేవున్ని ఆరాధించడమే సరియైన భక్తి అని చెప్పుచున్నాను. ఇతర దేవుళ్ళను ఒక్కరిని గానీ, ఎక్కువమందిని గానీ ఆరాధించడము సరియైన భక్తి కాదు అని అంటున్నాము.

**మా జ్ఞానము మంచిదికాదు అన్న ధర్మపీఠము వారికి నేను చెప్పిన జ్ఞానము తెలిసి, జైళ్ళలో యున్న ఖైదీలు కూడా మారిపోవుచున్నారు. అట్లు మారిన వ్యక్తి వ్రాసిన లెటర్ ఇక్కడ ప్రచురించుచున్నాము చూడండి. నా లాగా మీరు ఎవరినైనా మార్చగలిగారాయని సవాలు విసురుచున్నాము.**

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల వారి

పాద పద్మములకు నా సాష్టాంగ వందనములు.

సాక్ష్యాత్తూ ఖుదాకు (సజ్దా కర్తాహు) సాష్టాంగ వందనములు సమర్పించుకుంటున్నాను.

నేను అనగా జీవాత్మగా ఉన్న నా శరీరము యొక్క పేరు సయ్యద్ సల్మాన్‌షా S/o సయ్యద్ ముస్లీమ్‌షా నా వయస్సు 34 సం॥లు. వృత్తి అక్వేరియం (షోకేసులలో చేపలు పెంచి అమ్మటం) మతము ముస్లీమ్, చదువు 9వ తరగతి ఇంగ్లీషు మీడియము, నివాసము బెంగుళూరు (వివేక్‌నగర్).

ప్రస్తుతము సెంట్రల్ జైల్ బెంగుళూరులో అండర్ ట్రైల్ ఖైదిగా (UTP) ఉన్నాను. నా ఖైది నెంబర్ : 7579 / 14 రూమ్ నెంబర్ 10లో జైలు జీవితము అనుభవిస్తూ ఉన్నాను. నా కుటుంబ వివరాలు ఏమనగా

మా కుటుంబము వారు గత ఏడు తరాల నుండి ముస్లీమ్ పండితులుగా (అనగా హాఫిజె ఖుర్ఆన్, ఆలిమె ఖుర్ఆన్) ఉన్నారని తెలిపినారు. ప్రస్తుతం నేను తప్ప మా కుటుంబము వారు అందరూ ముస్లీమ్ పాండిత్యము కల్గిన వారే. (తమ గ్రంథముల ద్వారా జ్ఞానము తెలిసిన తర్వాత ఎవరు పండితులో అనే విషయము తెలిసింది).

నేను సాధారణ ముస్లీముగా ఉంటూ, నమాజ్ చేసుకుంటూ, రోజా ఉంటూ జీవితం గడుపుతూ ఉండేవాడిని. నాకు సాధారణముగా సహనము తక్కువ, కోపం ఎక్కువగా ఉండేది. ఎక్కువ అసహనముతో, ఆవేదనతో బాగా వత్తిడికి లోనౌతూ ఉండేవాడిని. జ్ఞానమునకు సంబంధించిన ఆలోచనలు వస్తూ వుండేవి. ఆ క్రమంలో నేను మా ఇంటి నుండి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాను. హిందూ పుణ్యస్థలాలైనా ద్వారకా (గుజరాత్) నగరమునకు వెళ్ళినాను. ఆ తర్వాత గోల్డెన్ టెంపుల్ (అమృత్సర్), హరిద్వార్, ఋషికేష్, డిల్లీలో ఉన్న ఆశ్రమాలు, మందిరములు, దర్గాలను సందర్శించుకుంటూ, హిందువుల జీవిత విధానాలు, ఆచరణలు, పూజా విధానాలు మరియు ముస్లీముల జీవిత విధానాలను పరిశీలించుకుంటూ, తెలుసుకుంటూ, 12 సం॥లు మా కుటుంబము వారితో సంబంధము లేకుండా గడిపి, తిరిగి 2008 సం॥లో ఇంటికి వచ్చాను. ఇంటిలో ఉంటూ రెండు సం॥లు ప్రైవేట్ వర్క్ చేసుకుంటూ ఉండగా, ఒక ముస్లీమ్ అమ్మాయితో ప్రేమలో పడి, మా కుటుంబమువారితో ఆమెతో పెళ్ళి గురించిన విషయము చర్చించితే వాళ్ళు తిరస్కరించారు. అమ్మాయి వాళ్ళ తల్లితండ్రులు కూడా ఒప్పుకోలేదు. అప్పుడు నేను అమ్మాయిని హైద్రాబాద్ తీసుకెళ్ళి, అక్కడ పెళ్ళి చేసుకొని, బాగ్ అంబర్పేట్, హైద్రాబాద్లో నాలుగు నెలలు ఉండి తిరిగి బెంగుళూర్కి వచ్చినాను. నేను మా ఇంటికి వెళ్ళకుండా కిరాయి ఇంటిలో ఉండేవాడిని. అప్పటి వరకు నేను ముస్లీము గ్రంథాలు

ఏవీ చదవలేదు. 2013 సం॥ వరకు నేను సాధారణ జీవితము గడుపు చుండగా కుటుంబ కలహాల కారణముగా మా బాబాయిని హత్య చేయటం జరిగింది. అది నేను చేశానని ఎవరికీ తెలియదు. మరలా కుటుంబ తగాదాల కారణముగా 2014 లో 7 సం॥లు గల నా చెల్లెలు కూతురుని కూడా నా భార్య సహాయముతో హత్య చేయడము జరిగింది. అప్పుడు పాత హత్య విషయము కూడా తెలిసిపోయింది. ఈ రెండు హత్యల కారణముగా నేను, నా భార్య 2014 సం॥ము జులై నెల 14వ తారీఖున జైలుకు రావడము జరిగింది. అప్పటి నుండి అనగా 14.07.2014 నుండి ఇప్పటి వరకు అనగా నాలుగు సం॥ల నుండి ఇద్దరము కూడా జైల్లోనే ఉన్నాము.

నేను జైలుకు వచ్చిన తరువాత జైల్లోఉన్న కొంతమంది ముస్లీమ్‌లతో పరిచయమై, 2014 జులై నుండి 2016 డిసెంబర్ వరకు హదీసులు చదువుకుంటూ, నమాజ్ చేస్తూ, రోజా ఉంటూ గడుపుతున్నాను. నేను చదివిన హదీసులు 1. సహీ బుఖారి (9 వాల్యూమ్‌లు), 2. అబుదావూద్ 3. తిర్మిజి 4. సహి ముస్లీమ్ మరియు మహమ్మద్ ప్రవక్త జీవిత చరిత్ర (సరాతున్నబి), వారి శిష్యుల ఖలీఫాల చరిత్రలు చదివాను. కానీ హదీసులు కొన్ని విషయాలలో ఒక దానిలో చెప్పిన దానికి, మరొక దానికి వ్యతిరేఖంగా ఉండేవి. నమాజ్ విధానము ఒక హదీసు వేరొక హదీసు చెప్పే విధానానికి వ్యతిరేఖంగా ఉండేది. జైల్లో కూడా నాలుగు, ఐదు (ఫిర్కే) వర్గాల వారు ఉన్నారు. మొత్తం ముస్లీమ్ సమాజము 73 వర్గాలుగా ఉన్నారని, 73వ వర్గం ఒకటి మాత్రమే జన్నత్ (స్వర్గం) లోకి వెళ్ళుతుందని చెప్పేవారు. 73 వర్గాలలో ఆ ఒక్కటి ఏది అంటే అందరూ మాది మాది మాత్రమే జన్నత్‌లోనికి వెళ్ళుతుంది. మిగతా వర్గాలవారు వెళ్ళరు అనేవారు. ఏ వర్గము జన్నత్‌లో వెళ్ళదని నమ్మకము, రుజువు ఏమిటి అంటే ప్రళయ

దినము అల్లాహ్ వద్దకు వెళ్ళిన తరువాత తెలుస్తుంది గానీ ఇప్పుడు చెప్పలేము, ఎవరికీ తెలియదు అని చెపుతున్నారు. నమాజ్ చేసుకుంటూ, రోజా ఉంటూ, బోధలు వింటూ ఉంటే, పాపాలన్నీ క్షమించబడి స్వర్గంలోకి వెళ్ళుతాము అని చెప్పేవారు. జ్ఞానం గురించి ఎంత తెలుసుకుంటుంటే, హదీసులు చదువుతున్నప్పుడు ప్రశ్నలు, సందేహాలు ఉంటుంటే పెరుగుతూ ఉన్నాయి గానీ స్పష్టమైన సమాధానము దొరకడము లేదు. తెలిసినవారని పెద్దలని అడిగితే వారు చెప్పే సమాధానము అసంపూర్తిగా ఉండేది. ఒకరు చెప్పేదానికి మరొకరు చెప్పేదానికి పొంతన లేకుండా ఉండేది.

ఇలా నా జీవితం సాగుతుండగా 2016 సం॥ సెప్టెంబర్ నెలలో నేనున్న రూమ్ (బ్యారక్) కు అమీర్ అలి అనే వ్యక్తి వచ్చాడు. అతను ఎప్పుడూ ఏదో చదువుతూ, వ్రాసుకుంటూ ఉండేవాడు, ఎవరితో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. నాకు 2016 సం॥ నవంబర్ నెలలో విపరీతమైన బ్యాక్‌పెయిన్ వచ్చి చాలా బాధపడుతూ ఉన్నాను. అప్పుడు నాకు వేరే వారి ద్వారా అమీర్ అలికి చూపించు, అతను ఏదో ట్రీట్‌మెంట్ చేస్తాడట అని తెలిసి అతనికి నా ప్రాబ్లమ్ గురించి చెప్పాను. అప్పుడు అతను నన్ను చెక్ చేసి ఏదో పాయింట్ల పై వత్తి ట్రీట్‌మెంట్ చేశాడు. అప్పుడు వెంటనే నొప్పి తగ్గి రిలీఫ్ అయింది. దానితో వారితో పరిచయము పెరిగి జ్ఞానము గురించి అడగడము జరిగింది. అప్పుడు ఆయన జ్ఞానము గురించి తెలుసుకోవాలని ఉంటే వచ్చి కూర్చోండి చర్చిద్దాము అని అన్నాడు. అప్పటి నుండి (2016 డిసెంబర్ నుండి) ప్రతి రోజు సాయంత్రము లాకప్ తరువాత 7 గంటల నుండి 9 గంటల వరకు, నాకున్న డౌట్స్‌కి ఖుర్‌ఆన్ ఆయత్‌ల ద్వారా చూపించి వివరించేవారు. ఒక నెల రోజులలో నా సందేహాలకు చాలా జవాబులు దొరికేవి. అంతేకాక ఎన్నో తెలియని రహస్యాలు కూడా తెలియజెప్పేవారు. ఖుర్‌ఆన్‌లో శరీరము గురించిన ఆయత్‌లు ఇలా

ఉన్నాయని, అల్లాహ్ విధానము ఇలా ఉంది అని వివరించేవారు. ఇప్పటి వరకు ఎవరూ చెప్పనివి, ఎవరికీ తెలియనివి చెప్పుతూవుంటే మొత్తం సత్యము, నిజమైనదని అనిపించింది. అప్పుడు ఇంకా ఎక్కువ జ్ఞాన విషయాలు తెలుసుకోవాలని పగలు కూడా జ్ఞానము గురించి చెప్పమని అడిగినాను.

అప్పుడు ఆయన సురా 3-7 ఆయత్‌ను చూపించి ఖుర్‌ఆన్‌లో ముహ్కామాత్ మరియు ముతషాబిహాత్ (స్థూల,సూక్ష్మ) ఆయత్‌లు ఉన్నాయి. ఇవి ఇప్పటి వరకు ముస్లీమ్‌లకు తెలియక ఖుర్‌ఆన్ మొత్తము ఆయత్‌లను స్థూలముగా వ్రాసుకున్నారు. అందుకే ఖుర్‌ఆన్ ఎవరికీ సరిగా అర్థము కాక, ఎవరికి అర్థమైనది వారు హదీసుల రూపములో వ్రాసుకొని, 72 వర్గాలుగా చీలిపోయారు. ఈ సూక్ష్మ ఖుర్‌ఆన్ ఆయతులను ప్రబోధానంద యోగీశ్వరులు అనే ఒక స్వామివారు వీటి గురించి వివరణ గ్రంథములో వ్రాశారు. వారి ద్వారానే నాకు ఈ జ్ఞానం దొరికిందని, వారు మూడు మతాల జ్ఞానం చెబుతారు, చాలా గ్రంథాలు వ్రాశారు. నీకు శ్రద్ధవుంటే జ్ఞానం తెలుసుకోవాలని అనిపిస్తే, నీకు స్వామివారు రాసిన గ్రంథాలు నా దగ్గర ఉన్నాయి. చదువుతానంటే ఇస్తాను అవి తెలుగు మరియు కన్నడ భాషలలోనే ఉన్నాయి. కొన్ని ఉర్దూలో ఉన్నాయి అని చెప్పారు. అప్పుడు నేను నాకు కన్నడ భాష వస్తుందని చెప్పాను. అప్పుడు నాకు మొదటిసారిగా 2017 సం॥ జనవరిలో **"ధర్మశాస్త్రం ఏది (ధర్మశాస్త్ర యావదు)"** అనే గ్రంథము ఇచ్చారు. అప్పటి వరకు నాకు ధర్మం అంటే, శాస్త్రము అంటే కూడా ఏమీ తెలియదు. కానీ ఈ గ్రంథము చదివిన తరువాత ధర్మము, శాస్త్రము అంటే ఏమిటో తెలిసింది. అంతేకాక చాలా జ్ఞాన విషయాలు తెలిసినాయి. అన్నీ నిజాలుగా అర్థము అయ్యాయి. మిగతా గ్రంథాలు కూడా చదవాలని శ్రద్ధ పెరిగింది. నేను 2017 సం॥ జనవరి నుండి

2018 సం॥ ఏప్రిల్ వరకు చదివిన మొత్తం గ్రంథాలు 1. ధర్మశాస్త్రం ఏది? 2. ప్రవక్తలు ఎవరు? 3. కర్మపత్రం 4. ఒక మాట మూడు గ్రంథాలు 5. దేవుని తీర్పు (జడ్జిమెంట్ ఆఫ్ గాడ్) 6. మూడు గ్రంథములు ఇద్దరు గురువులు ఒక బోధకుడు 7. ఒక్కడే ఇద్దరు 8. దేవుని రాకకు ఇది సమయము కాదా? 9.ఏసు చంపబడ్డాడా? చనిపోయాడా? 10. త్రైతాకార రహస్యం 11. నీకు నాలేఖ 12. గీతా పరిచయం 13. సాయిబాబా దేవుడా కాదా? 14. మంత్రం–మహిమ 15. దేవాలయ రహస్యాలు 16. ఇందూ సాంప్రదాయాలు 17. దయ్యాల–భూతాల యధార్థ సంఘటనలు 18. 1058 ఆధ్యాత్మిక ప్రశ్నలు–జవాబులు 19. భగవద్గీత 20. స్వర్గం ఇంద్రలోకమా! నరకం యమలోకమా? 21. దేవుని చిహ్నం 22. ఏది నిజమైన జ్ఞానం 23. మరణం తరువాత జీవితం 24. జనన మరణ సిద్ధాంతం 25. పునర్జన్మ రహస్యం 26. సమాధి 27. విశ్వవిద్యాలయం 28. సుబోధ 29. శ్రీకృష్ణుడు దేవుడా భగవంతుడా? 30. హిందూమతంలో సిద్ధాంతకర్తలు 31. ధ్యానం–ప్రార్థన–నమాజ్ 32. సామెతల జ్ఞానం 33. హేతువాద ప్రశ్నలు–సత్యవాద జవాబులు 34. హిందూమతంలో కుల వివక్ష 35. శిలువ దేవుడా? 36. వార్తకుడు–వర్తకుడు 37. ప్రబోధ 38. మన పండుగలు 39. తల్లి తండ్రి 40. త్రైతారాధన 41. భగవాన్ రావణ బ్రహ్మ 42. ఒక వ్యక్తి రెండు కోణములు 43. ప్రథమ దైవ గ్రంథం భగవద్గీత 44. మతం పథం 45. అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు, రెండవది వజ్ర వాక్యములు మరియు 46. ద్వితీయ గ్రంథము బైబల్ కూడా తెలుగులోవి ఉర్దూలో ట్రాన్స్‌లేషన్ చేసి ప్రతిరోజు రెండు గంటలు చెప్పేవారు. మిగతా గ్రంథాలలో ఉన్న డౌట్స్ కూడా అమీర్ అలితో అడిగి తెలుసుకొనేవాడిని.

పైన తెలిపిన గ్రంథాలు ఒక్కొక్క గ్రంథము చదువుతూ ఉంటే నాకు ప్రతి ఒక్క గ్రంథములో తెలియబడే జ్ఞానముతో ఆనందముతో క్రొత్త

అనుభూతులు పొందుతూ, నా హృదయం పులకించిపోయేది. నా గత జీవితములో ఉన్న కోపం తగ్గిపోయింది, సహనము పెరిగింది. నాలో ఊహించని మార్పు వచ్చింది. నాకు తమరి జ్ఞానము ద్వారా కొత్త జన్మ (అంటే బిందు పుత్రునినుండి నాద పుత్రుని జన్మ) ప్రసాదించబడిందని ఆనందముగా ఉన్నాను.

సాక్షాత్తూ ఖుదా చెప్పిన జ్ఞానము ద్వారా తెలియబడిన నిగూఢ రహస్య నిజాలు ఏమనగా మూడు ఆత్మల జ్ఞానం (జీవాత్మ, ఆత్మ, పరమాత్మ) మూడు గ్రంథాలలో ఉన్నదని భగవద్గీత 14-16, 17 శ్లోకాలు బైబిల్ మత్తయి సువార్త 28-19 వాక్యము, ఖుర్ఆన్‌లో 50-21 ఆయతుల ద్వారా తెలిసింది. మూడు దైవ గ్రంథాలలో చెప్పబడిన జ్ఞానము దేవుడు ఒక్కడే, దేవుని జ్ఞానము ఒక్కటే, దేవున్ని చేరవలసిన గమ్యము కూడా ఒక్కటే అనే విషయము తెలిసిపోయింది. మతాలను మానవులు తయారు చేసుకున్నారని అర్థము అయింది.

నేను ముస్లీముగా నా బాధ్యత నమాజ్, రోజా, జకాత్, హజ్ చేసి, హదీసులలో తెలిపిన ప్రవక్త ఆదేశాలను (సున్నత్‌లను) ఆచరిస్తే నేను నిజమైన ముస్లీముగా మారి జన్నత్ (స్వర్గం)లో చేరిపోతానని నమ్మినాను. కానీ ఖుదా వ్రాసిన గ్రంథాలు చదివిన తరువాత నిజమైన జ్ఞానము తెలిసిన తరువాత, అసలు నిజమైన ముస్లీమ్ ఎవరో తెలిసిపోయింది. నిజమైన నమాజ్, జకాత్, రోజా, హజ్, అల్లాహ్ సృష్టిఆదిలో ఉన్న పేర్లు అని, వాటి గురించి వివరణ చదినిన నాకు ఏదో రహస్య నిధి (దైవనిధి) దొరికినంత ఆనందం కల్గినది. జన్నత్ దోజఖ్ (స్వర్గం, నరకం) అంటే ఏమిటి? మోక్షం (ఆఖిరత్) అంటే ఏమిటి? అవి ఎక్కడ ఉన్నాయి? ఎలా ఉన్నాయి? అనే విషయము తెలిసింది. మా ముస్లీములకు తెలియని మోక్షం (ఆఖిరత్, నజాత్) కూడా ఉన్నదని స్వామి వారి గ్రంథముల జ్ఞానము ద్వారా తెలిసి ఆనందభరితుడైనాను.

తౌరాత్ అంటే భగవద్గీత అని ప్రపంచానికే తెలియని గొప్ప రహస్య జ్ఞానము చెప్పిన ప్రపంచములోనే మొదటి వ్యక్తిగా కీర్తికెక్కినారు. ఖుర్ఆన్‌లో తౌరాత్ అంటే ఏమిటో 5-44, 46, 48, 68 మరియు 62-5 ఆయతుల ద్వారా రుజువు చేసినారు. ఖుర్ఆన్‌లో 25-1, 2-53, 8-8 ప్రకారం ఫుర్ఖాన్ (గీటురాయి) మహమ్మద్ ప్రవక్తకు ఇచ్చిన గీటురాయి, మూసాకు ఇచ్చిన గీటురాయి (ఫుర్ఖాన్) ఒక్కటే అని, ఆ ఆయత్‌ల ద్వారా తౌరాత్ (భగవద్గీత) లో ఉన్న జ్ఞానము, ఖుర్ఆన్‌లో ఉన్న జ్ఞానం ఒక్కటేనని మరియు తౌరాత్ ఖుర్ఆన్‌కు మాతృ గ్రంథము (ఉమ్ముల్ కితాబ్) అని, బైబిల్ కూడా భగవద్గీతలో భాగమేనని పరమ రహస్యం తెలిసింది. మూడు గ్రంథములు ఒకే దైవము గురించి, మూడు ఆత్మల గురించి చెప్పినవని జీవాత్మలమైన మాకు ముక్తిని ప్రసాదించేవే మూడు గ్రంథాలు అని స్వామి వారి జ్ఞానము ద్వారా తెలిసింది.

తౌరాత్ (భగవద్గీత) లో చెప్పిన ప్రకారం ధర్మములు, అధర్మములు అంటే ఏమిటి, ధర్మాలు (బ్రహ్మ, కర్మ, భక్తి యోగాలు) ఆచరిస్తే మోక్షం వస్తుందని, అధర్మాలు (దానాలు, వేదాలు, యజ్ఞములు, తపస్సులు) ఆచరిస్తే పాప, పుణ్యకర్మలు అంటుకొని జన్మలు కలుగుతాయని తెలిసింది. ధర్మములు తెలిసి ఆచరిస్తే మోక్షం ప్రాప్తిస్తుంది అని, ఈ విషయమే ఖురాన్‌లో ఉందని తెలిసినది.

భగవద్గీతయే తౌరాత్ గ్రంథము అని, తౌరాత్ పేరుతో గ్రంథము ఎక్కడా లేదని బైబిల్‌లో మోషేకు, ఖుర్ఆన్‌లో మూసాకు ఇవ్వబడినదే భగవద్గీత గ్రంథము అని ఖురాన్ 6-91 ఆయత్ ద్వారా తెలిసింది. సృష్టి ఆదిలో దేవుని జ్ఞానము భగవద్గీత శ్లోకం 4-1 ద్వారా పరమాత్మ మొదట సూర్యునికి చెప్పాడు అని, సూర్యుడు మనువుకు చెప్పాడని, మనువు ద్వారా ఇక్ష్వాకుడు అను రాజుకు తెలియబడినది అని, అదే జ్ఞానం (జపర జ్ఞానం)

5000 సం౹౹ల క్రితం అర్జునుడికి శ్రీకృష్ణ భగవాన్ చెప్పారని, శ్రీకృష్ణ భగవానే మోషే (మూసా) కు స్వప్నంలో భగవద్గీత గ్రంథాన్ని తౌరాత్ పేరుతో ఇచ్చారని తరువాత శ్రీకృష్ణ భగవానే ఏసుప్రభువుగా వచ్చి బైబిల్ (ఇంజీల్) జ్ఞానము చెప్పినారు అని తరువాత సూర్యుడే పేరు మార్చుకొని జిబ్రయిల్‌గా తెర చాటు నుండి మహమ్మద్ ప్రవక్తకు చెప్పినారు అని తమరి గ్రంథాల ద్వారా తెలిసింది. ఎవరికీ తెలియని పరమ రహస్యాలు తెలిసి ఆనందభరితుడైనాను.

తౌరాత్ (భగవద్గీత) ప్రకారం నాకు తెలిసిన నిగూఢ జ్ఞానము సృష్ఠిఆదిలో పరమాత్మ నాలుగు భాగాలు (ప్రకృతి, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ) గా విభజింపబడినాడు అని, ప్రకృతి అనేది చర, అచర ప్రకృతిగా రెండు భాగాలుగా మారిందని, చర ప్రకృతిగా 24 భాగాల శరీరం, అందులో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు కలిపి 27 భాగాలు అని, ప్రకృతియే మాయగా గుణాల రూపంలో (సైతాన్) తలలో ఉంది అని, బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రాలు మనిషి కర్మలు అనుభవించడానికి మూలము అని, జీవాత్మ అయిన నేను గుణచక్రములో రవ్వంతగా ఉన్నానని, ఆత్మ శరీరము అంతా వ్యాపించి ఉంది అని, పరమాత్మ శరీరము లోపల, బయట అణువు అణువు వ్యాపించి ఉందని, ఖురాన్ 6-95 ఆయత్ ప్రకారం జీవాత్మల జన్మలు మూడు విధాలు అండజ, పిండజ, ఉద్భిజాలుగా ఉన్నాయని, కర్మలు మూడు విధాలు ప్రారబ్ధ, ఆగామిక, సంచిత కర్మలని, మరణాలు కూడా (మూడు +ఒకటి) నాలుగు అని కాల, అకాల, తాత్కాలిక, ఆఖరి మరణములు అని అద్భుతమైన అగోచర జ్ఞానము తెలిసినది.

నేను జీవాత్మనని, పరమాత్మ అంశనని, కర్మ బంధములో చిక్కుకొని ప్రకృతి చేతిలో ఉన్నానని, కర్మలు నాశనం చేసుకుంటేనే జన్మ, కర్మ బంధాల నుండి ముక్తి కలుగుతుందని, ముక్తి కలగాలంటే భగవద్గీతలో భగవానుడు

చెప్పిన ధర్మాలు బ్రహ్మ, కర్మ, భక్తి యోగాలు ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది అని తెలిసినది. 1. బ్రహ్మయోగం మనసును నియంత్రించడం అని 2. కర్మయోగం అహము (అహంభావం) లేకుండా, నేనే కార్యములు చేస్తున్నాననే భావం లేకుండా కార్యములు చేయడం అని 3. భక్తియోగం ధర్మముల ప్రచారము, దైవసేవ అని ఈ మూడింటి ద్వారానే కర్మలు నాశనం చేసుకొని, జన్మలు లేకుండా చేసుకొని మోక్షం పొందాలని తెలిసింది.

సూక్ష్మములో మోక్షం అంటే భగవంతుడిని తెలిసి సాకారాన్ని ఆరాధించడము భగవద్గీత శ్లోకాలు, 4-9, మరియు 18-66 ద్వారా తెలిసినాయి. శిశువు జన్మించిన తరువాత మొదటి శ్వాసలో జీవాత్మ ప్రవేశించిన తరువాతనే ప్రాణం వస్తుందని, మనిషికి స్థూల, సూక్ష్మ రెండు శరీరములు ఉన్నవని అలాగే స్థూల, సూక్ష్మ కర్మలు కూడా రెండు రకములు అని, దయ్యాలు, భూతాలు గురించి రహస్యాలు తెలిసినాయి. బ్రహ్మవిద్య శాస్త్రం ఆధ్యాత్మిక జ్ఞాననిధి అని తెలిసిపోయినది. మనిషి శరీరములోని బ్రహ్మనాడిలోనే, విశ్వము ఇమిడి ఉన్నదని, షట్ శాస్త్రములు, సర్వవిద్యలు, బయటి సమస్త ప్రపంచము, ప్రపంచాన్ని సృష్టించిన దేవుడు, మోక్షప్రాప్తి కూడా, సర్వము బ్రహ్మనాడిలో ఇమిడి ఉన్నాయనే నిజము తెలిసింది.

ఖుర్ఆన్ మరియు ముస్లీమ్‌ల విషయములో వారు అజ్ఞానముతో, అపోహలతో, భ్రమలతో ఖుర్ఆన్ గ్రంథములోని జ్ఞానాన్ని ఎలా తప్పుడు భావము చెప్పుకుంటున్నారో, తమరి జ్ఞాన గ్రంథాల ద్వారా నిజాలు తెలిసి విస్మయం, ఆశ్చర్యం కల్గినది. ఖుర్ఆన్‌లో దాగి ఉన్న రత్నాలు, ముత్యాలను సాధారణ రాళ్ళుగా భావించిన మా ముస్లీమ్‌లకు పంచి పెట్టిన జ్ఞాన ప్రదాతగా మీకు నా సాష్టాంగ సుమాంజలులు తెల్పుతున్నాను.

సురా 3 ఆయత్ 7 ద్వారా ఖురాన్‌లో ముహ్కామాత్ (స్థూల), ముతషాబిహాత్ (సూక్ష్మ) ఆయత్‌లు ఉన్నాయని, శరీరములో దాగివున్న సూక్ష్మజ్ఞానం గురించి తెలియని జ్ఞానాన్ని **అంతిమ గ్రంథములో, జ్ఞాన వాక్యాలు, వజ్ర వాక్యాలు** అనే రెండు జ్ఞాన గనులను మా ముస్లీమ్ సమాజానికి అందించిన తమరి రుణం తీర్చుకోలేనిది. మొత్తము ముస్లీమ్ సమాజానికే తెలియని అగోచర జ్ఞానాన్ని తెలిపిన ఖుదాకు (అల్లాహ్ జ్ఞానము అల్లాహ్‌కు తప్ప ఎవరికీ తెలియదు) భగవంతునికి, ఆదరణకర్తకు నా సజ్‌దా చేస్తున్నాను.

ఏడు ఆకాశాలు, భూమి వాటి మధ్య ఉన్న సమస్తము అంటే శరీరము అని 30-8, 11-123, 74-30,31 ఆయతుల ద్వారా, ముస్లీమ్‌లకు ఇంతవరకు తెలియని గొప్ప రహస్యం తెలిపినారు. శరీరము లోనే మూడు ఆత్మలు ఉన్నాయని ఖురాన్ ఆయత్ 50-21 ద్వారా **"తోలబడే వాడు జీవాత్మ, తోలేవాడు ఆత్మ, సాక్షిగా చూసేవాడు పరమాత్మ"** అని, ఇవి భగవద్గీతలో 14-16,17 మరియు బైబిల్‌లో మత్తయి సువార్తలో 28-19 నందు మూడు దైవగ్రంథాలలో ఉన్న విషయం ముస్లీమ్ సమాజానికి ఒక కనువిప్పుగా ఉన్నది. ముస్లీమ్‌లు ఆచరించే నమాజ్ తపస్సు అని, నిజమైన నమాజ్ శరీరములోనే ఉందని 4-103, 3-191 ఆయతుల ద్వారా తెలిసింది. జకాత్ అంటే వందరూపాయలకు 2.50 రూపాయలను బీదలకు పంచడము కాదని దైవసేవ, ధర్మప్రచారమని (భగవద్గీతలో చెప్పిన బ్రహ్మ, కర్మ, భక్తి యోగాలు అని) ఖురాన్ 48-15,16,17 ఆయతులని, రోజా అంటే అన్నం తినకుండా ఉండుట కాదని, ఖుర్‌ఆన్ 2-187 ఆ యత్ ద్వారా ఆత్మని పొందడము ఉపవాసమని తెలిసినది. హజ్‌లో చేసే ఆచరణ సఫా, మర్వా చర, అచర ప్రకృతికి గుర్తులు అని తెలియని రహస్యము తెలిసింది.

ముస్లీమ్‌లకు ఖుర్‌ఆన్‌లో సూక్ష్మ ఆయత్‌లు అర్థముకాక స్థూలముగా చెప్పుకొని మొత్తము ముస్లీము సమాజానికి ఖుర్‌ఆన్ దూరము చేసి, ఆయత్ 2-79 ప్రకారం మనుషులు హదీసులను వ్రాసుకొని అవి మాత్రమే బోధిస్తూ మొత్తము ముస్లీమ్ సమాజాన్ని 72 వర్గాలుగా చీల్చి, ఖుర్‌ఆన్‌కు, అల్లాకు దూరం చేసి ఖుర్‌ఆన్ ఆయత్‌లు 2-159, 41-40 ప్రకారం అల్లాహ్ శాపానికి గురైనారు. స్వర్గమే జీవిత లక్ష్యముగా పెట్టుకున్నారు. ముస్లీము లకు స్వర్గము, నరకము తప్ప, పరలోకము (మోక్షము) అంటే ఏమిటో? అవి ఎక్కడ ఉంటాయో తెలియకున్నారు. ఆయత్‌లు 10-106, 107, 108 స్వర్గం, నరకం గురించి, 3-14, 6-127, 13-24, 30-7,8, 40-39, 40 పరలోకము గురించి ఖుర్‌ఆన్‌లో ఉన్నప్పటికీ, ముస్లీమ్ పెద్దలకు తెలియకపోవడము దురదృష్టకరము.

ముస్లీములకు పునర్జన్మలు ఉన్నాయని ఖుర్‌ఆన్ ఆయతులు 7-29, 22-66, 36-68, 40-11 చెప్పుతున్నాయి. గత జన్మలో చేసుకున్న కర్మలు అనుభవించడానికే జన్మలు ఉన్నాయని ఆయత్ 10-4 చెప్పుతుంది. ముస్లీములకు తబ్దీర్ (కర్మ) అంటే పూర్తిగా తెలియదు. ఆయత్ 9-51, 57-22 పుట్టుక ముందే అన్నీ వ్రాయబడి ఉన్నాయంటే ఏమి వ్రాయబడి ఉన్నాయో తెలియక అయోమయములో ఉన్నారు. 7-187, 30-56 ప్రళయము గురించి, 9-5, 5-32 జీహాద్ గురించి, 72-6, 3-41 జిన్నాతుల గురించి, 40-40, 48-5 స్త్రీలకు స్వర్గము గురించి ఖురాన్‌లో స్పష్టముగా ఉన్నప్పటికీ తెలియకున్నారు.

97-1, 2, 3, 4, 5 ఖుర్‌ఆన్ ఆయత్‌ల ద్వారా సృష్ఠి రహస్యము తెలియబడింది. దానికి భిన్నముగా ముస్లీములు లైల తుల్ ఖద్రి అంటే

రంజాన్ అవతరించిన రోజు అని చెప్పుకుంటూ అధర్మ ఆచరణ చేస్తున్నారు. తమరి గ్రంథముల జ్ఞానము ద్వారా నిజమైన ముస్లీముగా మారినాను. తమరికి సాష్టాంగ నమస్కారములు.

## ముస్లీమ్ సమాజానికి నా విజ్ఞప్తి ఏమనగా!

మొత్తము ముస్లీమ్ సమాజము ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ చెప్పిన ఖుర్‌ఆన్‌లో ఉన్న సురా 3 ఆయత్ 7 ప్రకారం ముహ్కమాత్, ముతషాబిహాత్ అంటే స్థూలవాక్యములు, సూక్ష్మవాక్యములు అంటే ఏమిటో తెలియక అజ్ఞానముతో, ఖుర్‌ఆన్ ప్రవక్తకే అర్థమవుతుంది, మనకు అర్థము కాదని, ప్రవక్త జీవిత విధానమే మనము ఆచరించాలని ముస్లీము పెద్దలు, హదీసులు వ్రాసి వాటిని మాత్రమే బోధిస్తూ ఖుర్‌ఆన్ జ్ఞానానికి, అల్లాహ్‌కు మొత్తము ముస్లీమ్ సమాజాన్ని దూరము చేసి, తీరని అన్యాయము చేసి అల్లాహ్ శాపానికి గురైనారు (ఆయతులు 2-159, 41-40). ఖుర్‌ఆన్ ఆయత్ 6-91లో "మీ పెద్దలకు తెలియని విషయాలు ఎన్నో తౌరాత్‌లో తెలియబడ్డా యని" ఉంది. ఖుర్‌ఆన్ ఆయత్ 2-79 ప్రకారం మనుషులు వ్రాసిన హదీసులను వదలి, నిజమైన అల్లాహ్ భక్తులుగా, ఖుర్‌ఆన్ ఆయతు 51-56 ప్రకారము అల్లాహ్‌ను, నిజజ్ఞానం తెలిసి ఆరాధించుదాము. ముస్లీమ్ పెద్దలు వారికే ఖుర్‌ఆన్ ప్రకారము నిజ జ్ఞానము తెలియక తఖ్దీర్ గురించి, పునర్జన్మల గురించి, ప్రళయము గురించి, జీహాద్ గురించి, స్వర్గము, నరకము, మోక్షము గురించి, ముఖ్యముగా నమాజ్, జకాత్, రోజా, హజ్ గురించి అర్థముకాక తప్పు భావముతో హదీసులను వ్రాసి, ఖుర్‌ఆన్ జ్ఞానము తప్పు భావము చెప్పి, ముస్లీమ్ సమాజాన్ని 72 వర్గాలుగా చీల్చినారు. స్వర్గము పొందటమే జీవిత లక్ష్యముగా హదీసులు బోధిస్తున్నారు.

ముస్లీములారా! ఇప్పటికైనా మేల్కోండి. అల్లాహ్ మన కోసము ఖుర్ఆన్ ఆయత్ 2-186 ప్రకారం ఒక వ్యక్తిలో దైవశక్తి ద్వారా నిజమైన జ్ఞానాన్ని తెలియపరచడానికి పంపి మనలను నిజమైన ముస్లీములుగా, సంపూర్ణ ముస్లీములుగా చేయటానికి పంపి, యోగీశ్వరుల వారి ద్వారా **"అంతిమ దైవ గ్రంథములో జ్ఞాన వాక్యములు, వజ్ర వాక్యములు"** అని ముస్లీము సమాజానికి తెలియని ఖుర్ఆన్ సూక్ష్మ ఆయతుల జ్ఞానాన్ని అల్లాహ్ ప్రేరణతో (సంకల్పముతో) మనకు రెండు గ్రంథాలను వాటికి అనుబంధ గ్రంథాలను వ్రాసి ఇచ్చారు. కాబట్టి స్వర్గానికి తీసుకువెళ్ళే హదీసులను వదలి, మోక్షానికి తీసుకువెళ్ళే ఖుర్ఆన్ ఆయత్ 40-39, 41 ను తీసుకొని ఆచరించి, 72 వర్గాలను వదలి నిజమైన అల్లాహ్ మార్గములోనికి రావాలని అందుకోసము యోగీశ్వరులవారి గ్రంథములను అసూయ లేకుండా చదివి, అర్థము చేసుకొని ఆచరించి నిజమైన 73వ అల్లాహ్ వర్గములోకి వచ్చి మోక్షము పొందుదాము (ఖుదా హాఫిజ్). ఖుదాకు మీ ప్రియ భక్తుడి విన్నపము. నాకు సంపూర్ణ జ్ఞానము ప్రసాదించమని, భగవద్గీత శ్లోకము 17-66 ప్రకారం శరణు వేడుకుంటున్నాను. నా జీవిత ధ్యేయము దైవ జ్ఞానము తెలుసుకుంటూ, దైవసేవగా ధర్మప్రచారము చేసుకోవాలని నిశ్చయించుకొన్నాను. దానికి కావలసిన శక్తి సామర్థ్యాలను అనుగ్రహించమని, మీ దర్శన భాగ్యము కల్పించమని, ఈ జ్ఞానము చెప్పింది. సాక్ష్యాత్తూ ఖుదా, భగవంతుడే, ఆదరణకర్తేనని సంపూర్ణముగా విశ్వసిస్తూ.... సాష్టాంగ నమస్కారము చేస్తున్నాను.

ఇట్లు మీ ప్రియ భక్తుడు

**సయ్యద్ సల్మాన్‌షా**

